శ్రీరస్తు.

శుభమస్తు.

శ్రీ పంచాగ్నుల వేంకటనారశింహ
గురుచరణారవిందమకరందబిందాస్వాదననిష్ఠా
గరిష్ఠుండును భారద్వాజసగోత్రపవిత్రుండును
ఆర్యక్షత్రియవంశసుధాపారావారచంద్రుండును
చిత్రలేఖనవిద్యావిశారదుండును వెల్లాలకోదం
డరామరాజ పుత్రుండును శ్రీరాజరాజే
శ్వరీ వరప్రసాద లబ్ధుండును పంచదశీ
దీక్షాధురంధరుండునైన వెల్లాల
చెంచురామకవీంద్రునిచే
రచియింపంబడిన

# యీ బ్రహ్మానందరత్నాకరమను
# యోగశాస్త్రవిలాసవైభవ
# గీతార్థములు.

ఇది.

శ్రీమత్సరస్వతీ నిలయముద్రాక్షరశాలయందు
ముద్రింపంబడియె.

శ్రీరంగనాయకులపేట
నెల్లూరు.

1893 సం॥

శ్రీ గురుస్వామినేనమః

# బ్రహ్మానందరత్నాకరము.

శా॥ శ్రీపంచాగ్నులవంశసాగరమునన్ । శీతాంశుతుల్యుండవై।
ఆపోజ్యోతికళావిలాసమతివై । యావిర్భవంబొందియున్ । శ్రీపంచాక్షు
రమంత్రపంజరములో । చెల్వొందియున్నట్టినీ। శ్రీపాదాబ్జయుగంబునన్
నిరతమున్ । సేవించినేత్రమొక్కెదన్॥పరమశివమహా। దేవానినుపూజించె
దన్ ॥ దేవదేవవామదేవజగన్నాథ । భావమురంజిల్ల పరమభక్తుండనై।
సేవించినేత్రమొక్కెదన్ । పరశివమహాదేవనినుపూజించెదన్॥ ౧ ॥

స్థిరవైరాగ్యముబోధయున్ । శమదమా। దిజ్ఞానసంపత్తియున్।
పరమానందసుఖంబునాకొసగి నీపంచాక్షరీమంత్రపం । జరమున్ జూపిజ
గద్విలాసమతివై జన్మాదిదుఃఖంబులన్ । బొరలంజేయకనన్నునీకరుణచే।
పోషించుయోగీశ్వరా । శశిశేఖరా । భూతేశపరమేశ్వరా । భాషాప
తివినుతభవ్యచరితమహా । దోషశమననాగభూషణశంకర।పోషించుయో
గీశ్వరా । శశిశేఖరా భూతేశపరమేశ్వరా॥౨॥

కామక్రోధవిమోహలోభమదసం । ఘాతప్రతాపంబులన్ । నా
మీదన్ప్రసరింపకుండవరమున్ । నాకున్బ్రసాదించిని । సత్కర్మాచార
మునందునిల్పువరదా । కల్యాణసందాయకా । వ్యోమాతీతనిరంజనా।
పశుపతీ । యీశాకృపాసాగరా । త్రిపురాంతక। ఇంద్రాదిక్షేమంకరా
దేశకాలరహిత । దివ్యస్వరూపక । కాశీపురనివాస ।గజచర్మపరిధాన।
యీశాకృపాసాగరా । త్రిపురాంతక । ఇంద్రాదిక్షేమంకరా॥ 3 ॥

సోమార్కాదులభూతపంచకములన్ । సృష్టించిపోషించిని। ధా
మంబొందగజేయుదానిగతియున్ । దూరంబుగాజేసినీ । నామంబెప్పుడు
నాదుహృద్గతముగా । నాటంగబోధించవే । స్వామీవేంకటదేశికోత్తమ
సదా । సౌదామినీరూపకా । నిటలనేత్ర । సత్యజ్ఞానవిధాయకా । నా
దబిందుకళల । కాధారరూపమై । వేదవిద్యామతివై । విలసిల్లియున్నట్టి।
సౌదామినీరూపకా । నిటలనేత్ర । సత్యజ్ఞానవిధాయకా॥౪॥

మూలాధారముఖాంబుజాతములకున్ మూలంబునీవై జగ। జ్జాలాకా
రపరాపరప్రకృతికిన్ । సాకారమొందించియున్ । లీలామానసమొప్పనీ
వుజగమున్ ।లీనంబుగావించినా । వాలాజాలముగానునిర్గుణుడవై।ఆకా

శకేశాశివా । కృత్తివాస । యేకాంగవీరాభవా।లోకాలోకములనవలో కనముజేశేటి । శ్రీకరచారిత్రచిన్మయమూర్తి।దహ।రాకాశకేశాశివా।కృత్తివాస । యేకాంగవీరాభవా॥౫॥

శివజీవైక్యసమాధియోగముసదా । శ్రీశాంభవీదృష్టియుఞ్ । భువనభ్రాంతలేనిమానసము- సంపూర్ణప్రభోధంబునే । నవలంబించెటిసూత్రముఞ్దెలిపిబ్ర । హ్మానందముఞ్బొందనీ । స్తవరాజంబుపఠింపజేయుమభవా । దాక్షాయణీనాయకా । పంచదశీదీక్షాదిసుఖదాయకా । సాక్షాత్కరించినాసన్నుతివినుమయ్యా ।అక్షీణకరుణాకటాక్షమృత్యుంజయ॥ దాక్షాయణీనాయకా । పంచదశదీక్షాదిసుఖదాయకా॥౬॥

క్షీరాంభోనిధిమధ్యమందుజగముల్ క్షీణాకృతింజెందను । స్పారంబైప్రభవించినట్టివిషముఞ్ । సంరంభివై మ్రింగియుప్పారావారము శుద్ధిజేసి సురలుఞ్బ్రహ్మమునులుఞ్ మెచ్చగా । వీరావేశముతోడవెల్గినమహావిద్యాధరాశ్రీకరా । ప్రమదాధిపవిశ్వంభరామందిరా । సద్యోజాతముఖసంవిత్స్వరూపక । ఖద్యోతశతకోటికాంతిగలిగినమహా । విద్యాధరాశ్రీకరా। ప్రమదాధిపవిశ్వంభరామందిరా॥ ౭ ॥

శ్రీనాథాదిగురుత్రయాన్వితమహా । చిత్పీఠమధ్యాసనా । శీనుండౌని సుహృత్సరోరుహమునఞ్ చింతించిధన్యాత్ములై । నీనామాక్షరముల్ జపించుమునులఞ్ నిత్యప్రసన్నుండవై । జ్ఞానానందులజేసినట్టివిమలా। జ్ఞాంభోజపుష్పంధయా । ఫణికేయూరా । జ్ఞానదినకరోదయా । దంభోళినరలోకతారకరూపక । శంభోమరితమాగకుంభిచర్మాంబర । అంభోజపుష్పంధయా । ఫణికేయూరజ్ఞానదినకరోదయా ॥౮॥

దారిద్ర్యధతమిస్రచండకిరణాదర్ప్రోగ్రసంశోషణా । మారీస్ఫోటకదుష్టభూతశమనామాంగల్యచారిత్రసం। సారాసారవికారసాగరములో। జన్మించియున్నానునా । నేరంబెల్లశమించిమోక్షపదముఞ్। నిర్మించిగోత్రేశ్వరా । జగదీశ్వరనీలలోహితశుభకరా । కర్మసూత్రమచేతకడుభీతినొందితి। మర్మమెల్లనుదెలిపిమన్నించి। సుఖములు । నిర్మించుగోత్రేశ్వరా । జగదీశ్వరా । నీలలోహితశుభకరా॥౯॥

ఘనతఞ్ పాశుపతాస్త్రసాధనముచే । కాలాగ్నిరుద్రుండవై । యనలాక్షుజ్వలితాననంబునమరఞ్ । అత్యద్భుతాకారమై । యానిలానంధకదైత్యునిఞ్దునిమితం । ద్రిదిత్యలోకంబులఞ్ మనుబ్రహ్మాదులబ్రోచినావు

కృపతోమానాఘముఖ్యేశ్వరా। విరూపాక్షా। మండలత్రయమందిరా। దీనజనావనదివ్యసుందరగాత్ర - మానవుడనునాదుమనవిగైకొనవయ్యా। మానాఘముఖ్యేశ్వరా। విరూపాక్షమండలత్రయమందిరా॥౧౦॥

శ్రీరాగం. ఆదితాళం.

వేంకటగురువరపరమేశా। విమలకమలలోచనవేంకటగురువరపరమేశా। శంకరహరివిధిముఖరూపా। సకలలోకవిజ్ఞానసుదీపా॥ వేంకటగురువరపరమేశా॥ సత్తుచిత్తుఆనందమునీవైనావు సకలజగములకు। సాక్షివినీవు। చిత్తశాంతిగలయోగులకెల్లను। శీఘ్రముగనుగనుపడుచున్నావు॥ వేంకటగురువరపరమేశా॥౧॥ మూడుసుగుణములమూలప్రకృతినిజెనగి। మూడువిడచిప్రజ్ఞానముగలిగి। మేడుభూములనుదాటినవారికి। చూడచూడవిలశిల్లినవాడవు॥వేంకట॥౨॥ నాదబిందుచిత్కళలను రహితము జేసి। నాదినీవియనుభ్రాంతియుబాశి। వాదభేదములువదలినవారికివైభవంబుజూపించినవాడవు॥వేంకట॥౩॥ సర్వధర్మకర్మంబులత్యాగము జేసి। సర్వభూతములనొకటిగజూచి। నిర్వికారులైనిలచినవారికి। నిలిచినీవువరమిచ్చినవాడవు॥ వేంకట॥౪॥ పంచభూతములవైకారికములనిలిపి। ప్రణవమందుసర్వంబునుగలిపి। చెంచురామకవికనిశముశాంతముజెందునటులకృపతోడనుబ్రోవవే॥ వేంకటగురువరపరమేశా॥ విమలకమలలోచన వేంకటగురువరపరమేశా॥౫॥

చ॥ జయజయపార్వతీరమణ। శంకరచంద్రకళాధరశేఖరా। జయజయవామదేవగజ। చర్మదుకూలజగత్ప్రదీపకా। జయజయనాగభూషజలజాసనసన్నుతదివ్యసుందరా। జయజయవేంకటార్య గురుచంద్రకృపారససాంద్రధీమణి॥క॥ జయజయరజితగిరీశ్వర। జయజయవేదాంతవేద్యశాస్త్రవమథనా। జయజయమృత్యుంజయశివ। జయజయపంచాగ్నివంశచంద్రవిలాసా॥ క ॥ జయజయసాధువశంకర। జయజయనిటలాక్షసాంబ। శాంతనిధానా। జయజయమోక్షకలాపా। జయజయశ్రీవేంకటాఖ్యసద్గురురూపా॥

శుద్ధకాంభోదిరాగము-ఆదితాళం.

వేంకటనరశింహగురువరా। విశ్వంభరశుభకర॥ వేంకటనరశింహగురువరా॥ పంకజాంకశధ్వజప్రకాశ చక్రశంఖసత్కళంకములనుగలుగునీదుపాదపద్మముల్ - పొంకముగనమస్కరించినంతతంబు

నాదుహృదయ । పంకజముననిల్పినిన్నుబ్రస్తుతించెదనుప్రసన్న ॥ వేంకట॥ నాల్గువిధములైన శేవలకునుపాత్రునిగనుజేసి । నాల్గుసాధనములుదెల్పికరుణతోడను । నాల్గువేదములకుమూలమైనరాజయోగమందు । నాల్గువాక్యములనుసేర్పినన్నుధన్యునిజేయుమయ్యా ॥వేంకట॥౨॥ మూడువాసనలనుబాపి । మూడుయోగములనుజూపి । మూడునదులతీర్థములలోముంచితేల్చుచూ । మూడువిధములైనలక్ష్యములప్రమాణములనుదెల్పి । మూడునాకటిజేశినన్ను । ముఖ్యముగనుబ్రోవుమయ్యా॥ వేంకట ॥౩॥ ఆరుభూములనుతరింపజేసిఅయిదుభూతములకు । మీరియున్నమార్గమందునిల్పిఘోరసంసారదోషములకుసంటకుండజేసిసంతతంబు । ఆరుగురునిబారద్రోలిఆకసమునజేర్చుమయ్యా ॥ వేంకట ॥౪॥ రెండునిశ్చలంబుజేయుసాధనంబుబోధజేసి । రెండువకటైయైనదివ్యదృష్టిచేతనూ । బ్రహ్మాండకోటిసన్నిభప్రకాశమైనసహస్రార। పుండరీకమందునాదుబుద్ధినిల్వజేయుమయ్యా॥ వేంకట॥౫॥ బిందునాదకళలుమూడు । దహరగగనమధ్యమందు । పొందజేసియమృతరసముగ్రోలిచిన్మయా । నందసౌఖ్యమనుభవింపజేసి జన్మమరణములను । పొందకుండనన్నుస్వానుభూతునిగనుజేయుమయ్యా॥ వేంకట ॥౬॥ఇరువదొక్క-వేలయారునూర్లు। సంఖ్యజపమునిల్పి। ఇరువదైదుతత్వములనుయిరుకమరపులక । మెరుగుచున్నబ్రహ్మమందువిశ్వమంతలయముజేసి । పరమపదముచేరుటకునుభవ్యవరములొసగుమయ్యా ॥ వేంకట ॥౭॥ బ్రహ్మదండిబిళముదూరి । నిష్ప్రపంచదేశమున । ప్రకృతివికృతులనువారించినిర్గుణుండనై । బ్రహ్మచర్యవ్రతముబూని । సాక్షిరూపమువధరించి । బ్రహ్మయజ్ఞమాచరింపబ్రహ్మసూత్రమియ్యవయ్యా ॥ వేంకట ॥౮॥ కుండలింద్రుపైకినెత్తిమండలత్రయంబునొక్క- । మండలంబుగానుజేసిఅండపిండబ్రహ్మాండములుమునిగియున్నక్షీరజలధిలోన యమృతభాండమందుదేవదారుపండుదానమియ్యవయ్యా॥ వేంకట ॥౯॥ మాతృభావమునుహరించి । పత్నిభావమందుజేర్చి । పితృభావమునుతనువహించిమించియూ । శత్రుభావమెల్లతనదుమిత్రులందుజేర్చినిల్పి । సత్రయాగమందునిన్నుసన్నుతింపజేయుమయ్యా॥ వేంకట॥౧౦॥ తనదుసోదరినిగ్రహించిభార్యగర్భమందుజేర్చి । జననిగర్భమందునిల్చిధరకుదిగుచునూ । జననితోటిపొందచిత్తశాంతిలేకమరలలోక । మునజనింపకుండనాకు । మోక్షపదవియొసగుమయ్యా ॥ వేంకట॥౧౧॥ తల్లిగర్భమందుపుట్టిమరలమోహితాత్ముడగుచు । తల్లితోడపొందు

చున్నధర్మి మెద్దియో । తల్లిభార్యనొక్కటైతెసుతునిజన్మమెచటగలిగె । తెల్లముగనుదీనిభావమెల్ల నాకుదెల్పుమయ్య ॥ వేంకట ॥ ౧౨ ॥ మూడవస్థలకును సాక్షినైత్రికాలములనొక్క । యీడుగానునిరుపమానని ష్కళంకమై । చూడతరముగాక బట్టబయలుగానునిండియున్న । గూఢతేజమంమనన్నురూఢిగాను జేర్చుమయ్య ॥ వేంకట ॥ ౧౩॥ ద్వాదశాక్షరప్రయుక్తమంత్రపిండరూపునిగను । పాదుకొనగజేసిషోడశాక్షరీమహా। వేద మెరుగబోధజేసి । మెరుకనెల్లద్రోచినీప్రసాదలబ్ధునిగను జేసి । సంతసంబుజేయుమయ్య ॥ వేంకట ॥ ౧౪ ॥ పంచదశివిచారమైనపరమలాభమమరజేసి । పంచకోశములనుసోకకుండజేయవే। పంచవహ్నికులసుధాబ్ధిచంద్రమాపరాపరేశ । చెంచురామదాసవరదసర్వలోకసుప్రసన్న॥ వేంకట నరశింహగురువరా। విశ్వంభరశుభకర॥వేంకటనరశింహగురువరా॥౧౫॥

యింకుస్థాని-జంఝూటిరాగం-ఆటతాళం.

శ్రీరామతారకమంత్రం। శివశక్తిమయమైనచిద్రూపయంత్రం॥భూరిప్రణవనాదబిందుకళలలోన । చేరిచైతన్యమైయుండుయీమంత్రం॥శ్రీరామ॥సప్తకోటిమహామంత్రంబులకుమహా । గుప్తమైశాంతమైయుండుయీమంత్రం ॥ శ్రీరామ ॥౨॥ ఆధారాదిసహస్రారపర్యంతము । శోధించువారికి । దారుకుయీమంత్రం ॥శ్రీరామ॥ ౩ ॥ ఋగ్యజుస్సామాధర్వణవేదములకంటె । యోగ్యమైభోగ్యమైయుండుయీమంత్రం ॥శ్రీరామ॥౪॥ పృధివిజలాగ్నిపవనాంతరిక్షములకు । ఆదిదైవతయుతానైమెరయుయీమంత్రం॥శ్రీరామ ॥౫॥ స్వచ్ఛమైలోకాలోకములందువ్యాపించి।సచ్చిదానందమైవెలుగుయీమంత్రం॥శ్రీరామ॥౬॥ బ్రహ్మహత్యాదిమహాపాపములద్రుంచె॥బ్రహ్మస్వరూపమైబరగుయీమంత్రం॥శ్రీరామ॥౭॥ తాపత్రయాగ్నినిశమియింపజేశేటి । ఆపోజ్యోతియుదానైయుండుయీమంత్రం॥శ్రీరామ॥౮॥ అష్టాంగయోగనిష్టాగరిష్టులకెల్ల । పుష్టియొసగెటియమృత। వృష్టియీమంత్రం ॥ శ్రీరామ ॥౯॥ సద్గురూపాస్తికి । సత్యస్వరూపమై । చిద్గగనమందుశోభిల్లుయీమంత్రం॥శ్రీరామ ॥ ౧౦ ॥ గంగాయమునసరస్వతినదులందుము । నింగిజపియించితేశుభముయీమంత్రం ॥ శ్రీరామ ॥౧౧॥ బ్రహ్మాండకోశముభేదించువారిని । బ్రహ్మరథముపైనెక్కించుయీమంత్రం ॥ శ్రీరామ॥౧౨॥ దక్షిణోత్తరపర్వతములనడుమనున్న। మోక్షలక్ష్మియుబల్కపలుకుయీమంత్రం॥ శ్రీరామ॥ ౧౩॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మయనెమా

౮ । నిత్యమనుచుసంభాషించుయీమంత్రం ॥శ్రీరామ॥ ౧౪ ॥ సకలలోకం బులనిర్మాలమునుజేశె । అకలంకమైనఅపువధనముయీమంత్రం॥శ్రీరామ॥ ౧౫॥ సగుణనిర్గుణములుదానైగనుపట్టుచు। అగణితరూపమైయుండుయీ మంత్రం॥శ్రీరామ॥౧౬॥ సృష్టిస్థితిప్రళయసమయమ్ములనుమహా । సృష్టము గాగనుపరచుయీమంత్రం॥శ్రీరామ॥౧౭॥ యేకమేవాద్వితీయంబ్రహ్మాయ నెపదవి । వేకముగలిగితేఫలముయీమంత్రం ॥ శ్రీరామ ॥ ౧౮ ॥లక్ష్యార్థ వాచ్యార్థములనెనయగనుఅంత ।లక్ష్యార్థభావమైయుండుయీమంత్రం॥ శ్రీరామ॥ ౧౯॥ సర్వశబ్దంబులబలికించితుదకుయీ । సర్వనినదంబులనణ చుయీమంత్రం ॥శ్రీరామ ॥౨౦॥ హేతుదృష్టాంతరహితంబై సనాతన । భూతస్వరూపమైయుండుయీమంత్ర॥శ్రీరామ॥౨౧॥ఆకాశాతీతమైయ చలమైపూర్ణమై। యేకాంతదేశమైయుండుయీమంత్రం॥శ్రీరామ॥౨౨॥ యనుకమరపులులేక । యోగమాయకుమించి । పరమాణువై ప్రకాశిం చుయీమంత్రం ॥ శ్రీరామ ॥ ౨౩ ॥ సకలతేజంబులగలిగించిపిదపయీ। సకలరూపంబులజెరుచుయీమంత్రం॥శ్రీరామ ॥౨౪ ॥ తత్వమసియనెవా క్యార్థమెరిగిన। తత్వజ్ఞులకునిత్యవ్రతముయీమంత్రం॥ శ్రీరామ ॥౨౫॥ఇరు వదియొక్క వేలారునూరులసంఖ్య। సరణికన్నుమహాజపముయీమంత్రం॥ రామ॥౨౬॥ అగామిసంచితప్రారబ్ధములుదొలిగె । యోగరాజత్వమొం దించుయీమంత్రం ॥ శ్రీరామ॥ ౨౭॥ యేదిక్కు జూచినయేకవాక్యముతో డ । వాదించుచుండువై ఖరితోయీమంత్రం ॥శ్రీ॥౨౮ ॥ మంత్రయంత్రతం త్ర॥ప్రయోగములకెల్ల।మంత్రరాజంబై పెంపొందుయీమంత్రం॥శ్రీ॥౨౯॥ శక్తిపంచకమునకుజీవనంబై మహా।శక్తిస్వరూపమైయుండుయీమంత్రం॥ శ్రీ॥ ౩౦ ॥ సర్వాంతరస్థమైనిర్మలాకారమై । సర్వసాక్షియుదానైనెగడు యీమంత్రం ॥ శ్రీరామ ॥౩౧॥ పంచాగ్నివేంకటపరమగురురూపమై। చెం చురామకవినిరక్షించుమంత్రం ॥ శ్రీరామతారకమంత్రంశివశక్తిమయమైన చిన్మాత్రయంత్రం । శ్రీరామతారకమంత్రం॥౩౨॥

## శ్రీరామనామమాహాత్మ్యము.

శ్రీమహాతత్వార్థబోధవిశేషమైనదిరామనామం । సోమసూర్యా గ్నులనుమించిన । స్వప్రకాశముగామనామం ॥౧॥ మూడుగుణములప్రకృ తివికృతికి । మూలకందమురామనామం । యేడుతత్వంబులకునానల ।వె లుగుచున్నదిరామనామం ॥౨॥ నాల్గుసాధనములువహించితె । నడిశిరె

లువును రామనామం । వెల్గులోపల వెల్గుతానై । వెలుగుచున్నది రామనా
మం ॥౩॥ మూడుమూర్తుల జన్మభూమికి । మూలదైవము రామనామం ।
యేడువ్యసనములను హరించెటి । యోగసూత్రము రామనామం ॥౪॥ సక
లలోకంబుల భరించెటి । సత్యరూపము రామనామం । ప్రకటయోగీంద్రుల
కునైనను । పరమగోప్యము రామనామం ॥౫॥ నాదబిందుకళామయంబ
గు । వేదమంత్రము రామనామం । వాదభేదంబులను ద్రోలగిన । వారిభో
గము రామనామం ॥౬॥ జ్ఞానదృష్టిని జూడగలిగితె । మాననియ్యము రామ
నామం । లోనవెలుపల నిండియుండెటి । జ్ఞానదీపము రామనామం ॥౭॥ ని
రుపమానము నిర్విశేషము । నిష్కళంకము రామనామం । పరమకల్యాణ
ప్రదంబగు । ప్రణవనాదము రామనామం ॥౮॥ చూపునిల్పి భజించువారికి ।
సుఖము నొసగును రామనామం । చూపుమనసును ఒకటిజేసితె । శుభకరం
బగు రామనామం ॥౯॥ పంచవింశతితత్వములకును । మించియున్నది రామ
నామం । పంచదశమంత్రాక్షరములకు । ప్రాణకరణము రామనామం ॥
౧౦॥ కోటికమలజయజ్ఞఫలముకు । సాటియైనది రామనామం । మాటమ
రచినదూరదర్శికి । మంత్రయోగము రామనామం ॥౧౧॥ రెండునొక్కటి
జేయువారికి । నిండియున్నది రామనామం । పండువెన్నెలకాంతిగలిగిన ।
బ్రహ్మనాళము రామనామం ॥౧౨॥ అన్నిరూపంబులును దానైయాడుచు
న్నది రామనామం । అన్నిరూపంబును దనలో । నణచుకున్నది రామనామం
౧౩॥ పాపమనియెడు మేఘమునకు ప్రళయవాయువు రామనామం । పాపన
డుమను మెరయుచుండెటి । దీపరాజము రామనామం ॥ ౧౪ ॥ కర్మయో
గము లెన్నిసలిపిన । కానరానిది రామనామం । నిర్మలాత్మజ్ఞులకు నెప్పుడు ।
ధర్మమైనది రామనామం ॥౧౫॥ సోహమనుమంత్రార్థమిపుడలవి సేహము
క్తియు రామనామం । దేహవాసన వదలితేఘన । దివ్యదృష్టియు రామనా
మం ॥౧౬॥ నిదురలోపల నిదుర దెలిసితె । నిజము దెలుపును రామనామం ।
పదిలముగ సాధించువారికి । పరమపదమగు రామనామం ॥౧౭॥ జన్మదుఃఖా
బ్ధిని తరింపగ । జేయుచున్నది రామనామం । చిన్మయాత్ముల కెల్లకాలము ।
తన్మయము శ్రీరామనామం ॥౧౮॥ అష్టదళముల కమలమందున । నమరియు
న్నది రామనామం । అష్టదేహాంతరములందున । నంటకున్నది రామనామం
౧౯॥ యేకమైనిరవధికనిరుపమ । లోకమైనది రామనామం । శోకమోహ
వినాశకరమై । జూచుచున్నది రామనామం ॥౨౦॥ యేడుప్రాకారముల

కావలవెలుగుచున్నది రామనామం । మేడుశక్తుల గెలిచి తేతన । తోడబ
ల్కును రామనామం ॥౨౧॥ సర్వశబ్దంబులును దాని । సాక్షియైనది రామ
నామం । నిర్వికారము శుద్ధతత్వము । నిర్మలము శ్రీరామనామం ॥౨౨॥
మూడుకాలములందు బొలయని ముఖ్యబింబము రామనామం । మూడునదు
లను దాటువారికి । మోక్షలక్ష్మియు రామనామం ॥౨౩॥ మేరుచక్రాంత
రమునందున । మెరయుచున్నది రామనామం । కారణాచార్యునికతంబు
న । గానవొచ్చును రామనామం ॥౨౪॥ అమృతపానము జేయుసురలకు ।
నచలమైనది రామనామం।అమృతవర్షము గురియుచుండెటి అభ్రమే శ్రీరా
మనామం ॥ ౨౫ ॥ ధారణాయోగీంద్రులకు సుని । ధానమైనది రామనా
మం । ఘోరరోగవనంబులకును కుఠారమే శ్రీరామనామం ॥౨౬॥ ఆదిశే
షుని నిదురలేపితె । బోధ జేసును రామనామం । ఆదిమూలప్రకృతి గతికిన ।
నాదియైనది రామనామం ॥౨౭॥ తత్వమసివాక్యార్థమని యెడి । తత్వమే
శ్రీరామనామం । సాత్వికాదిగుణంబులకు నిస్సంగమైనది రామనామం ॥
౨౮ ॥ అజపగాయత్రిని రచించిన । ఆదిబీజము రామనామం । భువనపరుల
కునెల్లకాలము । బ్రహ్మయజ్ఞము రామనామం ॥౨౯॥ దేశమును కాలము
నుపొందని । దివ్యతేజము రామనామం । ఆశలను సర్వములద్రుంచెటి । యీ
శ్వరుడు శ్రీరామనామం ॥౩౦॥ తారకబ్రహ్మను భవులను । జేరియుండు
ను రామనామం । దారిదప్పక మ్రొక్కికొలచితె । దర్శనంబగు రామనా
మం ॥౩౧॥ యెరుకమరపుల నెరిగియుండెటి ! యెరుకయే శ్రీరామనామం
గరుడగమనాదులకునైనన । గమ్యమైనది రామనామం ॥౩౨॥ ముక్తికాం
తామణికి నెప్పుడు । ముదమొసంగును రామనామం । భక్తవరులకు క్షేమ
కరమై । ప్రబలుచున్నది రామనామం ॥౩౩॥ కామరాగాదులకునంటని ।
ధామమే శ్రీరామనామం । సోమసూత్రబిళంబులోపల । జ్యోతియే శ్రీరా
మనామం ॥౩౪॥ చిత్తశాంతిని గలుగజేశెటి । చిత్స్వరూపము రామనా
మం । సత్తుచిత్తుల రెంటినెనసెటి । స్వప్రకాశము రామనామం ॥౩౫॥
మహదహంకారాదిపరిగణ । సహితమైనది రామనామం । దహరగగ
నపథంబులోపల దర్శనము శ్రీరామనామం ॥౩౬॥ హృదయకమలజబిందు
వును పెం । పొందజేసును రామనామం । ముదముతో భ్రూయుగమున
డుమను । మోగుచుండును రామనామం ॥ ౩౭ ॥ దశవిధములగుమండల
ములను । దాటియున్నది రామనామం । కుశలబుద్ధియు గలిగి దలచితె ।

కో ర్కెదీర్చును రామనామం ॥౩౮॥ నిత్యమై పదివేలు రుకళలతో నిలచియు
న్నది రామనామం । సత్యలోకమునందు సుప్రస్థానమైనది రామ నామం ॥
౩౯॥ జన్మమృత్యుజరాదిహీనముకు । చండరశ్మియు రామనామం । తన్మ
యత్వమునొందువారికి । తత్పదము శ్రీరామనామం ॥౪౦॥ రజితగిరిప
తిసతికినెప్పుడు । రమ్యమైనది రామనామం । స్వజనపాలనవిలాసములకు
ను । స్వామియే శ్రీరామనామం ॥౪౧॥ యోగమార్గము దాల్చినట్టి ప్ర ।
యోగమే శ్రీరామనామం । ఆగమాంతవిచారసి[illegible] కాది నామము రా
మనామం ॥౪౨॥ నాల్గుదళముల కమలమందున । వెల్గుచున్నది రామనామం
నాల్గుఅక్షరనాదములుగా । నాటియున్నది రామనామం ॥౪౩॥ క్షరము అ
క్షరమును రచించిన గురునిరూపము రామనామం । కరణముల మూటికిని శ
క్యము । మెరుగుటకు శ్రీరామనామం ॥౪౪॥ పరమగోప్యము బ్రహ్మవాద
ము । భద్రచేతము రామనామం । స్థిరముగను బిందువును సిల్పితె । శుద్ధినొ
సగును రామనామం ॥౪౫॥ ఆరుదళముల కమలమందున । నవరయున్నది రా
మనామం । ఆరుఅక్షరనాదములుగా నాడుచున్నది రామనామం ॥౪౬॥ గ
ర్భనరకములన్ని బాపెటి । గానమే శ్రీరామనామం । భూభువాదికలో
కములకును । భూషణము శ్రీరామనామం ॥౪౭॥ వేదచోదితమై వెలిగెటి ।
విశ్వరూపము రామనామం । వేదవాక్యప్రమాణములచే పొందుకున్నది రామ
నామం ॥౪౮॥ పరమగురురూపంబు దానై । బరగుచున్నది రామనామం । ని
రతిశయబోధస్వరూపము । నిర్మలము శ్రీరామనామం ॥౪౯॥ పదిదళంబుల
కమలమందున । కదలకున్నది రామనామం । పదివిధములగు । నాదములు
గా । బలుకుచున్నది రామనామం ॥౫౦॥ సప్తకోటిసుమంత్రములకును ।
గుప్తమైనది రామనామం । సప్తజిహ్వనిమండలములో జ్ఞప్తియే శ్రీరామనా
మం ॥౫౧॥ జ్యోతిరూపంబును వహించిన సుప్రకాశము రామనామం । జా
తినీతులులేనిమానస । జపవిధానము రామనామం ॥౫౨॥ జ్ఞానయోగము
చేతజూచితె । గానవచ్చును రామనామం । మానసానందమును గలిగెటి ।
మానమే శ్రీరామనామం ॥౫౩॥ విమలద్వాదశపత్రకమలమునెనశియున్నది
రామనామం ॥ సమరసముగా పదియురెండక్షరములాయెను రామనామం ॥
౫౪॥ బిందుచలనములేనివారల । పొందియున్నది రామనామం । బిందుమం
డలమధ్యగతమగు యిందురూపము రామనామం ॥౫౫॥ ఘనసుషుమ్నానా
డియెందున కాంతియే శ్రీరామనామం । అనిమిషత్వమునొందితే బ్రహ్మత్వ

మొసగును రామనామం ॥౫౬॥ మూడు దేహంబులను సోకని । మూల దేహ
ము రామనామం । వేదశాస్త్రాకారములకావల । వెలుగుచున్నది రామనా
మం ॥౫౭॥ బంధకంబుల నెల్ల ద్రుంచెడి ప్రకటయోగము రామనామం । అం
ధులై యున్నట్టి వారలకందరానిది రామనామం ॥ ౫౮ ॥ పదియు నాదదశం
బులు మ్రోగగల । పద్మమే శ్రీరామనామం । పదియు నాడుల స్వరాక్షరములుగ
బలుకుచున్నది రామనామం ॥౫౯॥ దూరదృష్టియు లేనివారికి । దుర్లభము
శ్రీరామనామం । నీరు పాలును వేర్పరించెడి నీరుడెలుపును రామనామం ॥
౬౦ ॥ లేశము గుణమును దెలియు వారికి । దాతయగు శ్రీరామనామం ॥ ధాత్రి
శాస్త్రసిద్ధాంతముల పైనెడి । దైవమే శ్రీరామనామం ॥ ౬౧ ॥ రెండు జూపిన
గాని నొక్కటై । పొందియున్నది రామనామం । సందులేకనె జాడ రూప
ము నొందియున్నది రామనామం ॥౬౨॥ ఆదిమధ్యాంతములు లేక నఖండమై
నది రామనామం । ఆదిశక్తికి సాటిశక్తియు । పాదసేవను రామనా
మం ॥౬౩॥ శాంభవినిపథ రంయించువారికి । సాధనము శ్రీరామనామం । శం
భు నేత్రము దెరచి చూచితె । శత్రునాశము రామనామం ॥౬౪॥ భ్రూకుటిమ
ధ్యమునందు వెలిగెటి । దీప్తియే శ్రీరామనామం । వుసరి జిహ్వాకుసుమం
బు బలికెటి । జపనినాదము రామనామం ॥ ౬౫ ॥ కపటయోగము
చేత నెవరికి । గానరానిది రామనామం । జపతపోవ్రతయజ్ఞములచే । జె
ప్పగానిది రామనామం ॥ ౬౬ ॥ రెండుదళముల కమలమందున । నిండియు
న్నది రామనామం । రెండు అక్షరనాదములతో పండియున్నది రామనామం॥
౬౭॥ మొదటిసంత్రము దెలియువారికి । ముక్తిమార్గము రామనామం । ప
దిలముగ పఠియించు మునులకు బ్రహ్మకర్మయు రామనామం ॥౬౮॥ అయిదు
ముఖముల బలుకు పక్షికి । అక్షరము శ్రీరామనామం । అయిదు భూతంబు
లను బ్రమించెటి । ఆశయము శ్రీరామనామం ॥౬౯॥ మేనుమనమును దుఃఖి
మానము । లేనిదే శ్రీరామనామం । మేను నేననియున్నవారికి । లేనివస్తు
వు రామనామం ॥౭౦॥ సర్వలోకాతీతమై శివసహితమైనది రామనామం ।
నిర్వికల్పమునిజ రామ్యతనిత్యభోగము రామనామం ॥౭౧॥ ద్రష్టదర్శనదృ
శ్యజాలవి । రహితమే శ్రీరామనామం । దృష్టికిని గోచరము గానిది దూర
దేశము రామనామం ॥౭౨॥ మండలత్రయ మార్గమందున మరిగియున్నది రా
మనామం । కుండలిని భేదించి చూచితె పండువెన్నెల రామనామం ॥౭౩॥ గా
లిమనసును దూలజేసెటి । ఘనునితపమే రామనామం । నీలితో చదవ ధ్య

మంటున । నెగడియున్నది రామనామం ॥౨౪॥ సద్భావముచేతగొలిచితె
యమృతమొసగును రామనామం । అమృతనాదము నాలకించితె । అమిత
సౌఖ్యము రామనామం ॥౨౫॥ ధరణికిని యాకాశవీధికి । దగిలియున్నది రా
మనామం । మరణము నాశము లబాపుచుండెటి । మంత్రయోగము రామనామం
౨౬॥ పరమతారకరాజయోగభ్రాజమానము రామనామం । చిరతరంబగు
పూర్ణదృష్టికి । శిద్ధి మొసగును రామనామం ॥౨౭॥ ప్రకృతి వికృతుల రెంటి
నంటని । బ్రహ్మమే శ్రీరామనామం । సుకృతదుష్కృతయోగములలో ।
సోకకున్నది రామనామం ॥౨౮॥ అచలమై యానందమై పరమాణువైనది రా
మనామం । అచలమానసమున భజించితె । యఖిలశుభములు రామనామం
౨౯॥ శివవిరించిహరీంద్రసురమునిసిద్ధదేవ శ్రీరామనామం । భవముదోషము
కలుము రేయుం । బగలు లేనిది రామనామం ॥౩౦॥ తెలివిలోపల తెలివి తా
నై । తెలియుచున్నది రామనామం । వెలుగు చీకటి రెండు లేకను వెలుగుచు
న్నది రామనామం ॥౩౧॥ సాంఖ్యయోగము బూనుటకు బల్ । సాధనము
శ్రీరామనామం । సంఖ్యలేని చరాచరంబుల । సాగజేయు రామనామం ॥
౩౨॥ ఆత్మతపమును సల్పువారికి । ఆత్మయజ్ఞము రామనామం । ఆత్మజీ
వాత్ములును దానై । యాడుచున్నది రామనామం ॥౩౩॥ మూడవస్థల యుం
డునంటని । మోక్షపదవియె రామనామం । మూడు మూర్తుల బీజములుగా ।
మ్రోగుచున్నది రామనామం ॥౩౪॥ ఘనతరోంకారంబునందున । గాన
మొప్పును రామనామం । అనిమిషులు పానంబుచేసెటి । అమృతబిందువు
రామనామం ॥౩౫॥ నారదాదిమునీంద్రులకు సంసారమైనది రామనామం ।
మారుతాత్మజుమనసులోపల । మరిగియున్నది రామనామం ॥౩౬॥ జన్మ
మరణంబులను పొందని । చదువు నేర్పును రామనామం । చిన్మయంబై సృష్టి
కిని సువిశేషమైనది రామనామం ॥౩౭॥ నరకమను చీకటికి సదమల । తరణి
బింబము రామనామం । పరమగుహ్యము ధీప్రకాశము । బ్రహ్మనాదము
రామనామం ॥౩౮॥ విష్ణులోకము శైవలోకము । ఇంద్రలోకము రామనా
మం । విష్ణుమాయను గెల్చువారికి విశదముగ శ్రీరామనామం ॥౩౯॥ నిర్గు
ణంబగు చిత్సమాధికి । నిశ్చలము శ్రీరామనామం । దుర్గుణంబుల ద్రుంచివై
చెటి । తుర్యరూపము రామనామం ॥౪౦॥ నిత్యముక్తికి నిత్యభుక్తికి । సత్య
వచనము రామనామం । సత్యవాక్యధురీణులకు సంసర్గమే శ్రీరామనామం ।
౪౧॥ సోహమనె మంత్రార్థవిదులకు । సోమపానము రామనామం । మో

హానునులోభమును బెనగని వ్యూహమే శ్రీరామనామం ॥౯౨॥ గురునిపాదద్వయము తానై । మెరయుచున్నది రామనామం । పరమపదముకు మార్గమిచ్చేటి । చరమరూపము రామనామం ॥౯౩॥ వేయుదళముల కమలమందున వెలుగుచున్నది రామనామం । మాయమాటలు బల్కువారికి । మార్గమియ్యదు రామనామం ॥౯౪॥ కుండలింద్రునిపడగెమీదను । పండియున్నది రామనామం । నిండుగా నిర్గుణసమాధికి పండువెన్నెల రామనామం ॥౯౫॥ దృక్కుదృశ్యంబులకు మిక్కిలి । యెక్కువైనది రామనామం । ఒక్కనిమిషములోన మనమును । నిక్కజేసును రామనామం ॥౯౬॥ నిక్కుచుండెటి మనసువృత్తిని స్రుక్కజేసును రామనామం । వక్క అక్షరనాదమై పెంపెక్కియున్నది రామనామం ॥౯౭॥ ప్రతినిమిషము జపము జేసితె । పరమధర్మము రామనామం । అతులితంబై సర్వగతమై యాడుచున్నది రామనామం ॥౯౮॥ వాసనత్రయములను విడచిన వారిధనమే రామనామం । (శ్రీ) సదాశివయోగపథముకు । క్షిప్రసిద్ధియు రామనామం ॥౯౯॥ జ్ఞానశక్తి ఆదిశక్తికి । మానమే శ్రీరామనామం । జ్ఞానభూములు యేడు గడిచితె । మౌనదేశము రామనామం ॥౧౦౦॥ తానువచ్చిన దారి దెలిపెటి । జ్ఞానమే శ్రీరామనామం । తానుబొయ్యే మార్గసరణిని జగపఠించును రామనామం ॥౧౦౧॥ జీవభావము యీశభావము । జెప్పుచున్నది రామనామం । జీవునికియీశునికి నైక్యము । జెంద జేసును రామనామం ॥౧౦౨॥ ఆత్మమంత్రము ఆత్మయంత్రము ఆత్మతంత్రము రామనామం । ఆత్మభోగము ఆత్మయాగము । ఆత్మయోగము రామనామం ॥౧౦౩॥ నిర్వికల్పసమాధియోగము । నిర్విచారము రామనామం । సర్వమును వ్యాపించియున్నది । సత్యముగ శ్రీరామనామం ॥౧౦౪॥ క్షుద్రమంత్రజ్ఞులకు నెప్పుడు క్షోభకరమగు రామనామం । నిద్రజెందక తన్ను దెలసితె ముద్రభావము రామనామం ॥౧౦౫॥ వుపనిషత్సారాంశమునకు మహాత్సవము శ్రీరామనామం । జపతపస్స్వాధ్యాయములకును జన్మభూమియు రామనామం ॥౧౦౬॥ వుపనిషద్గోప్యంబు తానై యొప్పియున్నది రామనామం । విఫలులైకను గానని వారికి । చపలచిత్తము రామనామం ॥౧౦౭॥ కులముమతమును లేని బుధులకు కోర్కెలిచ్చును రామనామం । సలలితంబుగ ప్రణవరవమును । వెలయజేసును రామనామం ॥౧౦౮॥ బట్టబయలుగ భక్తులకు గనుపట్టుచున్నది రామనామం । పట్టుగొమ్మై పరమమునులకు । బరగుచున్నది రామనామం ॥౧౦౯॥ సర్వ

మునుతనలోననుంచుక । నిర్వహించును రామనామం । సర్వజగములలో
ననుండియు । సంస్ఫురించును రామనామం ॥౧౦॥ దృశ్యమంతయునశ్య
మైనా । దూలదెప్పుడు రామనామం । విశ్వరూపమే విగ్రహముగా వెల
సియుండును రామనామం ॥౧౧॥ కంటికి నిమనసుకును గురిగా । గానరా
నిది రామనామం । మించి త్రర్వులు లిఖించెటి మేటిదైవము రామనామం ॥
౧౨॥ కంటిపాపను మెనసి మెరసేటి ఘనగురుండె రామనామం । తుంట
విల్తునిభయముబాపెటి । మింటచంద్రుడు రామనామం ॥౧౩॥ ద్వాదశా
క్షరిషోడశాక్షరి । బోధజేసును రామనామం । వేదములనాల్గింటికిని తను
పాదుకున్నది రామనామం ॥౧౪॥ పంచదశిమంత్రప్రభావము । మించి
యున్నది రామనామం । సంచితప్రారబ్ధములను సంహరించు రామనా
మం ॥౧౫॥ బయలులో పలబయలు తానై ప్రకటమైనది రామనామం । భ
యములన్నియు బాపుచుండెటి । బ్రహ్మమే శ్రీరామనామం ॥౧౬॥ చక్ర
తీర్ధములోన వెలిగెటి । చంద్రబింబము రామనామం । వక్రములమూడిం
టిబాపెటి సుక్రమము శ్రీరామనామం॥౧౭॥ అమృతకుంభము మీదనాడెటి
హంసమే శ్రీరామనామం। అమృతనాడిమధ్యమందున। నమరియున్నది రామ
నామం॥౧౮॥ బీజమును మూలమును లేని సుభూజమే శ్రీరామనామం। రాజ
యోగసుధాబ్ధిగతమగు రత్నరాజము రామనామం॥౧౯॥ పశ్చిమప్రాదేశ
మందున బరగుచున్నది రామనామం। నిశ్చలంబుగ కన్నుదెరచి తెనిజసమాధి
యు రామనామం॥౨౦॥ అండమును పిండమును రెంటిని నంటియుండదు రా
మనామం। దండిగా బ్రహ్మాండమంతయు నిండియున్నది రామనామం ॥౨౧॥
కార్యకారణములను మరచితె। స్థైర్యమొసగును రామనామం। ఆర్యసేవకులై
నవారికి। నందియున్నది రామనామం॥౨౨॥ సుప్తిజాగ్రత స్వప్నమూర్ఛల
జూచుచుండును రామనామం । జ్ఞప్తిగ రచినవారిమనసుకు వ్యాప్తమైనది
రామనామం ॥౨౩॥ నేనునీవును లేనినిర్గుణమౌనమే శ్రీరామనామం । జ్ఞా
నమజ్ఞానములు రెండును । లేనిదే శ్రీరామనామం॥౨౪॥ యెన్నికల్పంబు
లునసించిన। యేకరూపము రామనామం। సన్నుతించనుతరము గాదది యె
న్నటికి శ్రీరామనామం ॥౨౫॥ స్వచ్ఛమగు వాచామగోచర । స్వప్రకాశ
ము రామనామం। నిశ్చలంబై నిభరావంబై నిలచియున్నది రామనామం॥౨౬
కర్మనేత్రద్వయము చేతను కానరానిది రామనామం। మర్మమెరిగిన గురువరే
ణ్యుని। ధర్మమే శ్రీరామనామం ॥౨౭॥ సకలదృశ్యంబులకు నెప్పుడు సాక్షి

నైనదిరామనామం। ఒకటియైనానానాస్వరూపములొందియున్నదిరామనామం ॥ ౧౨౮ ॥ చీకటినివెల్తురునురెంటిని। జెందకున్నదిరామనామం। లోకధర్మములన్నివిడచితె। శ్రీకరంబగురామనామం ॥ ౧౨౯ ॥ నిరతిశయమునిరీహభావము। నిరుపమానమురామనామం। పరమపూరుషతత్వమయమై। బరగుచున్నదిరామనామం ॥౧౩౦॥ యిట్టిదనివర్ణించుటకుగురి। యెవరుయెరుగరురామనామం। గుట్టుదెలసినదేశికులకేగురుతుపడుశ్రీరామనామం ॥ ౧౩౧॥ శ్రీమహావాక్యార్థవేత్తలనీమమేశ్రీరామనామం వ్యోమమార్గముమీరితెసంయోగభావమురామనామం ॥౧౩౨॥ వేయుదళములకమలసారము। మేయుచున్నదిరామనామం। శ్రీయుతంబగుశక్తివిద్యకుకాయమేశ్రీరామనామం ॥౧౩౩॥ గంగయమునసరస్వతీనదులంగనులుగారామనామం।లింగదేహములోననిల్చుచుపొంగుచున్నదిరామనామం॥ ౧౩౪॥ అంగమునలింగమునుగల్పినయపుడెబల్కునురామనామం। సంగరహితవిచారమైసత్సంగమైనది। రామనామం ॥౧౩౫॥ తోడబుట్టినదానిపొందెటి। జాడదెలుపునురామనామం। మూడుదీక్షలబొందితెసం। మోదమొసగునురామనామం ॥౧౩౬॥ తడియులేనిసుపాదతీర్థము। వడయజేయునురామనామం। పొడియులేనిప్రసాదమొసగెటిపూర్ణతత్వమురామనామం ॥౧౩౭ ॥ దుష్ప్రసంగములన్నిబాపెటి। తుర్యరూపమురామనామం।నిష్ప్రపంచమునిర్మమత్వము।నిత్యశుద్ధమురామనామం॥౧౩౮॥ సప్తసాగరములుతరించితెసాధ్యమగుశ్రీరామనామం। గుప్తమగునవ్యక్తతత్వావ్యక్తమైనదిరామనామం॥౧౩౯॥ సృష్టికినిపూర్వంబునొకటైజూచుచున్నదిరామనామం।సృష్టిగలిగినపిదపరెండై।స్పష్టమైనదిరామనామం ౧౪౦॥ అంతరింద్రియములకునైనను। అంతుదెలియదురామనామం। అంతరింద్రియనిగ్రహులకేయమరుచున్నదిరామనామం ॥ ౧౪౧॥ మాతృసంసర్గయునుదెరింగినమార్గమేశ్రీరామనామం। మాతృభార్యాక్రమమునొకటైమరిగియున్నదిరామనామం ॥ ౧౪౨ ॥ అప్రమేయంబైనచిద్బ్రహ్మాండకోశమురామనామం। అప్రతర్క్యంబైనమహదానందరూపమురామనామం ॥ ౧౪౩ ॥ పంచవిధసంస్కారభ్రమలను। బాపుచుండునురామనామం। పంచకోశంబులనువిడచితె। బ్రహ్మనిష్ఠయురామనామం॥ ౧౪౪ ॥ పంచభూతంబులకులంకెలు। త్రెంచివైచునురామనామం। పంచయజ్ఞాతీతదృఙ్మయబ్రహ్మమేశ్రీరామనామం ॥ ౧౪౫ ॥ సచ్చిదానంద

స్వరూపముసత్యలోకము రామనామం । యిచ్ఛలేనిమహాత్ములకుజగదేక దీపము రామనామం ॥ ౧౪౯ ॥సర్వశూన్యమునప్రమేయము । నిర్వినోద మురామనామం । సర్వతోముఖమైజగంబుకుసాక్షియైనది రామనామం ॥ ౧౪౭ ॥ కారణముదృష్టాంతమునుపాడగానరానిది రామనామం । కోరు వారికిగురునిజేరితే । కోర్కెదీర్చును రామనామం ॥ ౧౪౮ ॥ పంచపావ కవేంకటార్యునిపాదయుగళము రామనామం । చెంచు రామకవీంద్రునికిక రుణించుచున్నది రామనామం ॥ ౧౪౯ ॥ యీమహాశ్రీదివ్యనామమునెవ రుచదివిన రామనామం । సోమసూర్యాగ్నులనుమించిన గ్రామమిచ్చును రామనామం ॥ ౧౫౦ ॥ సకలశుభములుసకలసుఖములుసత్కరించును రా మనామం । సకలఐశ్వర్యములొసంగునుసంతతము శ్రీరామ నామం॥ శ్రీగు రుచరణారవిందార్పణమస్తు ॥ ౧౫౧ ॥

యిందుస్థానికాపిరాగము.

రామునిపూజించరానిరతము । రామునిపూజించరా। కామక్రో ధాదివైరి । గణములసంహరించి । నీమానసంబులోన । నిల్పిధ్యానంబు జేసి ॥రాముని ॥౧॥ అంతర్లక్ష్యములోన । ఆనందమునజెంది । శాంత శమదమాది । సద్గుణములుగల్గి ॥ రాముని ॥౨॥ మనసుమారుతములమా ర్గమొకటిగజేశి । ఘనమైనసుషుమ్నాంత । ర్గతుడైవెలసిల్లుచున్న॥రాము ని॥౩॥ తత్వమస్యాదిమహా । త్త్వార్థమెరిగిశుద్ధ । సత్వంబుధరియించి । స ర్వాత్ముడైనయాత్మ ॥రాముని ॥ ౪ ॥ నేత్రద్వయముమూశి । నేర్పుగాది వ్యజ్ఞాన । నేత్రముచేతగాంచి । నిత్యప్రసన్నుడైన ॥ రాముని ॥ ౫ ॥ మూడుదేహంబులకు । మూలకందముతానై । యేడుచక్రములనడుమ। వెలుగుచునున్నయాత్మ ॥ రాముని ॥ ౬ ॥ యోగమాయనుగూడి । యే కాంగవీరుడగుచు । నాగేంద్రతల్పమందు । నాట్యమాడుచునున్న ॥ రా ముని ॥ ౭ ॥ గంగాదినదులుమూడు । సంగమమైనచోట। శృంగాటకంబు నందు । శోభిల్లుచున్నయాత్మ ॥ రాముని ॥ ౮ ॥ మింటచిత్తర్వులు। మెప్పుగావ్రాయుచుండె । కంటిపాపనుగూడి । ఘనుడైరాజిల్లుచున్న॥ రాముని ॥ ౯ ॥ శివకేశవాదినానాచిత్ర్రకాశంబులను। భువనగణంబుల ను । బుట్టించుచున్నయాత్మ ॥ రాముని ॥ ౧౦ ॥ అద్యంతములులేకనచ లుడై । పరిపూర్ణుడై । విద్యావిద్యాతిరిక్త వేద్యుడైమించినట్టి ॥ రాము ని ॥ ౧౧ ॥ సప్తావరణంబులకు । సాక్షియైమహామాయా । గుప్తబ్రహ్మం

డసము । దీప్తుడై వెలశిన ॥ రాముని ॥ ౧౨ ॥ యరుకమ్మరవులనెరిగే। యరుకకుమించినట్టి । పరమబ్రహ్మంబుతానై । భాశిల్లుచున్నయాత్మ ॥ రాముని ॥ ౧౩ ॥పంచకోశంబులకు । ప్రభువైనిరంతరము। పంచాగ్ని వేంకట । పరమగురురూపుడైన ॥ రాముని ॥ ౧౪ ॥ జగతిలోవెల్లాల । చెంచురామకవిని । సుగుణవంతునిజేసి । సుఖిమై మెరయుచునున్న । రాముని పూజించరా । నిరతము । రామునిపూజించరా ॥ ౧౫ ॥

శ్రీపంచాగ్ని వేంకటగురుస్వామినేనమః.

బలహంసరాగము । ఆదితాళము.

శ్రీమనోహరము । రామనామము । జీవానీవుధ్యానించరా॥ సామరస్యపరాయణమహత్వమూ । సకలమానులకు । పెన్నిధానమురా శ్రీ ॥ ౧ ॥ నిత్యజీవనము । రామనామము । నిజామృతము । రామనామము । సత్యజ్ఞానవిలాసప్రకాశము । సర్వపాపమేఘ । జుఝూనిలంబురా ॥ శ్రీ ॥ ౨ ॥ పరమపావనము రామనామము । బ్రహ్మరుద్రులకు పరంధామము । నిరుపమానచిదానందసౌఖ్యము । నిర్మలాత్ములకునిత్యాధారంబురా ॥ శ్రీ ॥ ౩ ॥ ధీవిలక్షణము రామనామము దేశకాలనియమాభావభావము । జీవన్ముక్తికళాశిద్ధియోగము । జీవేశ్వరులకుమూలమంత్రంబురా ॥ శ్రీ ॥ ౪ ॥ భవనివారకము । రామనామము । బ్రహ్మయజ్ఞపరాయణవిచారము । శివజీవైక్యసమాధిస్వరూపము । చిన్మయాత్ములకువేదసారంబురా ॥ శ్రీ ॥ ౫ ॥ సర్వకారణము । రామనామము । సకలమంత్రములకుమూలకందము । నిర్వికారికమునిర్విశేషము । నిజభక్తులకెల్లమహాభోగమురా ॥ శ్రీ ॥ ౬ ॥ కల్యాణప్రదమురామనామము। కామక్రోధలోభ మోహనాశము । బాల్యవృద్ధవయోధర్మరహితము । బంధమోక్షములకుమూలతంత్రమురా ॥ శ్రీ ॥ ౭ ॥ సతతతారకము । రామనామము । సకలలోకములకుసత్తామాత్రము।చతుర్వేదసారార్థవిశేషము । చపలచిత్తులకుదుర్లభత్వమురా ॥ శ్రీ ॥ ౮ ॥ హంసరూపకము। రామనామము । అమృతశిద్ధులకునాదిభూతము । హింసయెన్నటికిలేనిదేశము । హంసమాత్రులకునమితలాభంబురా ॥ శ్రీ ॥ ౯ ॥ యేకరూపకము రామనామము । యోగమాయాదేవీసహితాకారమూ । ఆకాశాదిపంచభూతాతీతము । అచలమానసులకునిత్యశోభనమురా ॥ శ్రీ ॥ ౧౦ ॥ దహరసంగతము । రామనామము । ధర్మశాస్త్రములకునధిష్ఠాన

ము । మహావాక్యతర్కశాస్త్రసారము । మానసియ్యులకుమహాగో
ప్యమురా ॥ శ్రీ ॥ ౧౧॥ వాంఛితార్థదము । రామనామము । వాదభే
దరహితదివ్యగాత్రము. చెంచురామకవిశ్రేసౌభాగ్యము । పంచాగ్నుల
వేంకటార్యతేజంబురా ॥ శ్రీమనోహరము । రామనామము। జీవానీవ్రాం
ధ్యానించరా ॥ ౧౨ ॥

పూర్ణషడ్జమరాగం.

రూపకతాళం.

శ్రీరామనామమంత్రశిద్ధినొందరా । జీవా । శ్రీరామనామమంత్ర
శిద్ధినొందరా॥క్షారరాగశాత్రవులను । గూల్చిచిత్తము । పదిలపరచి ॥
శ్రీరామ ॥ ౧ ॥ కాలమును । దేశమును । కామమునువిడచి । సీలతోయ
దమధ్యమందు । నిశ్చలముగమనసుజేర్చి ॥ శ్రీ ॥ ౨ ॥ తామసము । రాజ
సము। దైన్యమునువదలి।సోమసూర్యమండలములస్వప్రకాశములోకటిజేశి॥
శ్రీ ॥ ౩ ॥ నీమతము । నీవ్రతము । సంతతముగాదూ । భూమిసలిలములు
మొదలగు । భూతపంచకమునుతెరించి ॥ శ్రీ ॥ ౪ ॥ శాంతమునమానము
నుదాంతమునుబూని । అంతరంగమునందుపరమ । హంసరూపమువధరిం
చియు ॥ శ్రీ ॥ ౫ ॥ వ్యాకులముపోనుపము । శ్రీకరముగానూ । లోకము
లనుమరచిసత్యలోకమంమున్నరుకకలిగి॥ శ్రీ ॥౬ ॥ కాంచనముగేహమును।
ఘనతరముగాదూ । పంచవంహ్నివేంకటార్య । పాదపద్మములనుగొల
చి ॥ శ్రీరామ ॥ ౭ ॥

యిందుస్తానిబ్యాకురాగం- ఆదితాళం.

రామనామమంత్రామృతపానము। రాజయోగమునకుమూలమురా
భూమితోయవైశ్వానరపవన । వ్యోమములకునాధారమురా । వ్యోమకే
శబ్రహ్మేంద్రజనార్దన । సోమపానమైయొప్పునురా ॥ రామ ॥ ౧ ॥
యేమవిడచినాల్గింటినిగెలిచెటి । యోగివరులకారోగ్యమురా । మూడున
దులను । దాటినవారికి । మూలబంధమునుద్రెంచునురా ॥ రామ ॥ ౨ ॥
నాల్గుసాధనములమరినవారికి । నానాజన్మవిరహితమురా । వెల్గులనె
ల్లను । వృద్ధినిజేశెటి । వేదవాక్యసాధనమురా ॥ రామ ॥ ౩ ॥ ఆరు
భూములనుగడచినవారికి । యనిశముపరమానందమురా । దూరదృష్టి
చేనిలచినవారికి । దుఃఖజలధినింకించునురా ॥ రామ ॥ ౪ ॥ రెంటినొక
టిగాజేసినవారికి । రేయుబగలులేకుండునురా । కంటికిమింటికిమీరినవా

రికి । కలుషసంఘములబాపునురా ॥ రామ ॥ ౫ ॥ పదిగుర్రములకుపదుగు లునిల్పిన।పరమపురుషులకుభోగ్యమురా । పదియేనక్షరములుగురుతెరిగిన పావనులకునూసులభమురా ॥ రామ ॥ ౬ ॥ యరుకమరపులను । యరిగినవారికి । యోగమార్గమునుజూపునురా । చరమార్థములోమర్మముదెలిశినశాంతులకెల్లనుసౌఖ్యమురా ॥ రామ॥ ౭ ॥ కులముమతముపజించినవారికి । కుశలబుద్ధిగల్గించునురా ॥ లలితప్రణవనాదానుమోదుల్లగు।లక్షణులకుసౌభాగ్యమురా ॥ రామ ॥ ౮ ॥ పంచాగ్నులవేంకటగురుపదములు । గాంచినవారికి । దృశ్యమురా । చెంచురామకవివంశసాగరము। సంరక్షణముజేసునురా ॥ రామ ॥ ౯ ॥

యింకుస్తానికాపిరాగం - ఆదితాళం.

రామునిశేవించవే । వోమనసా । రామునిశేవించవే। కామక్రోధాదుల । కడకుబారగజిమ్మిసోమసూర్యులనడుమనూ। శోధించియాత్మారాముని ॥ ౧ ॥ రెంటినొక్కటిజేశి । రేయుబగలుమూడో । కంటిచేతనుబూచుచూ । గగనంబుమీరి ॥ రాముని ॥ ౨ ॥ పైకికిందికినెగసె । పక్షినిగట్టివేశి । యేకచిత్తముతోడను । యోగంబుబూని ॥ రాముని ॥ ౩ ॥ యిరువదినాలుగు । వీధులుగలిగిన । పురముపరిశీలింపుచూ। భోగీంద్రుడైన ॥ రాముని ॥ ౪ ॥ఆరుసాగరముల । కావలనున్నట్టి । మేరుచక్రముమీదనూ । మెరయుచునున్న ॥ రాముని ॥ ౫ ॥ అమృతనాడీరంధ్రమందుప్రవహింపుచున్న । అమృతపానముజేయుచూ । ఆనందమున ॥ రాముని ॥ ౬ ॥ మూడునదులనడుమ । ముక్తికాంతనుగదశి । గాఢాలింగనముజేయుచూ । కారణగురుడౌ ॥ రాముని ॥ ౭ ॥ జన్మమరణములులేని । చదువుప్రారంభించి । చిన్మయత్వమునొందుచూ । శీఘ్రమేనీవూ ॥ రాముని ॥ ౮ ॥ భూమిసలిలాదిపంచ । భూతములనుగెల్చి । సామరస్యపారీణుడై । సర్వాత్ముడైన ॥ రాముని ॥ ౯ ॥ పంచాగ్నివేంకట । పరమగురునినమ్మి । చెంచురామకవీంద్రునీ । చిత్తేశుడైన ॥ రామునిశేవించవే వోమనసారామునిశేవించవే ॥ ౧౦ ॥

యిందుస్తానిజంఝోటిరాగం - ఆటతాళం.

సౌభాగ్యమేరామనామం । సూరివరులకుమోక్ష । సుఖముయీనామం ॥ సౌ ॥ శోభితనిత్యనిరాభాసమై । యీభువనములకు । మూలమీనామం ॥ సౌ ॥ ౧ ॥ బ్రహ్మరుద్రేంద్రాదిసకలసురలకెల్ల। బ్రహ్మస్వరూ

పమై । బరగుయీనామం ॥ సౌ ॥ ౨॥ బిందునాదచిత్కళాతీతరూపమై।
యెందుజూచినగాని । వెలుగుయీనామం ॥ సౌ ॥ ౩ ॥అండపిండాండ
బ్రహ్మాండగోళములందు । నిండిపరిపూర్ణమై । యుండుయీనామం ॥
సౌ ॥ ౪ ॥ తత్వమస్యాదిమహావాక్యరూపమై। తత్వార్థసారమై।యుం
డుయీనామం ॥ సౌ ॥౫॥ అంతర్బహిర్మధ్యలక్ష్యార్థములుగల । శాం
తులైనవారిధనముయీనామం ॥ సౌ ॥ ౬ ॥ పరమహంసతత్వపారీణులై
నట్టి । పరమమునులకుపెన్నిధానమీనామం ॥ సౌ ॥౭ ॥ జాగ్రదాద్యవస్థ
లకుసాక్షిరూపమైవుగ్రకర్మంబులనణచుయీనామం ॥ సౌ ॥ ౮ ॥ ఆరుచ
క్రములకు । నాధారరూపమై । మేరుచక్రమునందు । మెరయుయీనా
మం ॥ ౯ ॥ ప్రకటపరాపర । ప్రకృతులకంటక । సకల.కతేజమైవెలుగు
యీనామం ॥ సౌ ॥ ౧౦ ॥ అమృతపానముచేతదనరినసురలకు । అమృ
తస్వరూపమైయుండుయీనామం ॥ సౌ ॥ ౧౧ ॥ జననపాలనవిలయ।
వ్యాపారములుగల । ఘనమాయాలీలచేనెనయుయీనామం ।సౌ ॥౧౨ ॥
మూడుదైవములకు । మూలమైవిలశిల్లి । మూడువిడచినవారి। ముదముయీ
నామం ॥ సౌ ॥ ౧౩ ॥ వేదశాస్త్రములకు । నెరుగబడకమహా । బోధ
స్వరూపమైవెలయుయీనామం ॥ సౌ ॥ ౧౪ ॥ పంచాగ్నివేంకట। పరమ
గురురూపమై । చెంచురామకవినియేలుయీనామం ॥ సౌ ॥

జంఝూటిరాగం- ఆటతాళం.

రామబ్రహ్మానందరసముపానముజేశి । రంజిల్లుచుండరవోజీవా।
కామక్రోధాదులఖండించినీవాత్మారామడవైయుండువోజీవా॥ రామ॥౧
యిరువదినాలుగు । వీధులుగలిగిన । పురముకన్నులజూడువోజీవా । పర
మహంసనుమెక్కిపరమబ్రహ్మానంద। గురిగల్గిజపియించువోజీవా॥రామ॥
౨ ॥ పశ్చిమబిళములోపలనిదురజెందుచు । నిశ్చలముగనుండువోజీవా ।
ఆశ్చర్యకరమైనఅపరాప్రకృతియొక్క । దుశ్చేష్టలుడిగించువోజీవా ॥ రా
మ॥ ౩ ॥ రెంటినొక్కటిజేశి । రేయింబగలుమూడో । కంటిచేతజూడు
వోజీవా । మింటికిపైనుండి । మెండుగామ్రోగెటి । ఘంటానాదమువిను
మువోజీవా ॥ రామ ॥ ౪ ॥పదియారుగుర్రముల । పశిడిరధముతోడు।
కదలకుండగబట్టువోజీవా । పదినూర్లచంద్రులభాశిల్లజేశెటి। సుదతినిగూ
డుమువోజీవా ॥ రామ ॥ ౫ ॥ అండపిండాండబ్రహ్మాండగోళకములునుం
డెటిపురిజూడువోజీవా ॥ పండువెన్నెలబయలునిండివెల్లుచునున్నపుండరీ

కముజూడువోజీవా॥ రామ ॥ ౬ ॥ పంచాగ్ని వేంకట । పరమగురునాథు ని । గాంచి సేవింపుమువోజీవా। చెంచురామకవికిజీవనకరమని। మెంచిసు ఖయించుమువోజీవా ॥ రామ ॥

కాంభోజిరాగము- ఆదితాళము.

రామమంత్రజపముజేయరా । గురుభక్తికలిగిశ్రీ ॥ రామ ॥ వ్యో మవీధి దాటినీదు । మనసునిశ్చలంబు జేసి । యరుకమరవులను మెరింగి। రాజయోగివై । సోహంసూర్యమండలములనొక్క మండలంబు జేసి । సోహమనే మానసపూజాక్రమంబు దెలసియాత్మ । రామ ॥ ౧ ॥ ఆరువిధములైన పురములనుదహించి ధైర్యమునపదారుకళలుమించినట్టి పురములోనను వీరమోహినీస్వరూప మొందియున్నముక్తి కాంత । తీరుదెలసిదానిపొందు । గోరప్రణవసౌధమందు ॥ రామ ॥ ౨॥ పశ్చిమప్రదేశమందుయున్న బిలములోనజొచ్చి । స్వచ్ఛమైన యమృతనదీప్రవాహమందునీ । యిచ్ఛదీరమునిగిమునిగి । వేదసారమనుభవించి।గచ్చిదగ్నికుండమందు। బ్రహ్మయజ్ఞమొనరించి ॥ రామ ॥ ౩ ॥ ధరణిజలమునిప్పుగాలి । లేనిచోటనిలచినీవు । పరమశాంతమునుధరించి । నిర్మలుండవై । నిరుపమానసహస్రకమలపీఠమందు జేరి । యిరువదొక్క వేలయారునూర్లసంఖ్యదప్పకుండ ॥ రామ ॥ ౪ ॥ పంచకోశములనుడచి । నిష్ప్రపంచభావమున । ప్రకృతిగుణకదంబమెల్లలయముజేసిశ్రీ । పంచవహ్ని వేంకటార్యుపాదపద్మములనమ్మి । చెంచురామకవినటంచుసంభ్రమించిసంతతంబు ॥ రామమంత్రజపముజేయరా ॥ ౫ ॥

అసావేరిరాగం॥ ఆటతాళం.

రామబ్రహ్మతత్వమునెరుగకున్నా । భూమిలోపలశిలలనెల్లను । బొగడితేవరమిచ్చునా ॥ రామ॥ ౧ ॥ మనసుబ్రహ్మమందుననిల్పకున్నా కనులుమూసుకపలుకకున్నను కర్మమెల్లనుదొలగునా ॥ రామ ॥ ౨ ॥ అవ్యయానందమున జెందకున్నా। దివ్యనదులలో మునిగితేయిా । దేహవాసనబోవునా ॥ రామ ॥ ౩ ॥ యేకాంతసమాధియోగమబ్బకయున్నా నీకుచిత్తమువికలమైతే । లోకవాసనవిడుచునా ॥ రామ ॥ ౪ ॥ సకలము సుబ్రహ్మమనిదలచకున్నా । సకలధర్మంబులును గలిగితే । శాస్త్రవాసనవదలునా ॥ రామ ॥ ౫ ॥ జీవన్ముక్తిసౌఖ్యముగలుగకున్నా । యేపుపాయముచేతనైనా । యోగమాయనుగులుచునా ॥ రామ ॥ ౬ ॥ అం

తలఁక్షుద్రశిద్ధియునొందకున్నా । యెంత్తగాలము తపముజేశిన । యెరుకమరపులనెరుగునా ॥ రామ ॥ ౭ ॥ గురుమంత్రంబుననుసంధింపకున్నా । పరుగులెత్తుచుభూమిదిరిగితె । పరమపదముకుబోవునా ॥ రామ ॥ ౮ ॥ వేంకటార్యునిపదమునుగనకున్నా । శంఖచక్రాంకితములొందితె । చక్రతీర్థఁమదొరుకునా ॥ రామబ్రహ్మతత్వమునెరుగకున్నా ॥ ౯ ॥

కాపిరాగం- అటతాళం.

నీలోనభజయించరా । శ్రీరామునినీలోనేదర్శిఁచరా । కాలత్రయమునందు । కడుభక్తితోమాయా । ఏలలన్నియుమదిలో । లీనంబుగాజేశి ॥ నీలోన ॥ ఆశాపాశముద్ర్యంచరా । సుఖమున్నాదేశాంతరంబునకేగరా । కాశీప్రయాగాది । ఘనతీర్థఁములమునిగి । గాశిజెందుటెకాని కైవల్యమునులేదు ॥ నీలోన ॥ ౨ ॥ సప్తావరణంబులనూ । దాటియుజీవన్ముక్తిసుఖముబొందరా । సప్తకోటిమంత్రజపములచేచపల । ప్రాప్తినొందుటేకాని । పరమపదమునులేదు ॥ నీలోన ॥ ౩ ॥ మతభేదములమానరా । చిదాకాశ । గతినిపరిశోధించరా । వ్రతములచేతను । మతినిశ్చలముజేశి । వెతలనొందుటెకాని । విజ్ఞానమునులేదు ॥ నీలోన ॥ ౪ ॥ నీతావుగురుతెరగరా । దహరాకాశజ్యోతినిదర్శిఁచరా । భూతలంబునబుట్టిపుణ్యపాపములచే । ఖ్యాతినొందుటేకానికడతేరగాలేవు ॥ నీలోన ॥ ౫ ॥ పంచాక్షరంబులలోమర్మముదెలశి । పంచభ్రాంతులుమానరా । పంచాగ్నివేంకటపరమగురుబోధచే । చెంచురామకవివై । సర్వకాలమునీవు ॥ నీలోన ॥ ౬ ॥

శహానారాగం - అటతాళం.

శ్రీరామరామరామాయనేమంత్రంబు । చింతించవేమనసా । ఘోరదుర్వారసంసారసాగరమందు । దూరియీరీతినదుఃఖించనేలనే ॥ శ్రీ ॥ కంటిలోపలనున్నకారణగురుడేము । కన్గొంటిశుడనరాదా । మంటిపాలైపొయ్యెమానవదేహము । వెంటవచ్చుననే । విభ్రమంబేలనే ॥ శ్రీరామ ॥ ౨ వేయుకళములకమల । వీధిలోనెలకొన్న । విష్ణునిగనరాదా । మాయావేషంబులుమరిమరిధరియించి । మాయాశక్తిచేత । మరణమొందగనేల ॥ శ్రీరామ ॥ ౩ ॥ లలితప్రణవనాదమాలకించుట సర్వలక్షణమనరాదా । మలమూత్రములగుంట్ట । మరిగికాముకుడవై । చలనచిత్తముగలిగి । చరియింపగానేల ॥ శ్రీరామ ॥ ౪ ॥ పశ్చిమదేశమునబంగారుమేడలో । పణ

తినిగనరాదా । ఆశ్చర్యకరమైనయఖిలదేవతలను । నిశ్చయమునినమ్మినీ ల్గిపోవగనేల ॥ శ్రీరామ ॥ ౫ ॥ సచ్చిదానందపదవినిబొందేమార్గము । సాధించికనరాదా । పచ్చిమాంసపుముద్దల్పణతులపాలిండ్లు । హెచ్చై నసుఖమనియేలరమించేవు ॥ శ్రీరామ ॥ ౬ ॥ పంచాగ్ని వేంకటపరమగురు నిపాద । పద్మముగనరాదా । చెంచురామకవిశేఖరుండనని । కించిజ్ఞత్వ ముచేతక్రీడించనేలనే ॥ శ్రీరామ ॥

సురటరాగం - అటతాళం.

పరమామృతమూ । జీవావినుమూ । బాగాపానముజేయుమూ। బహుగోప్యము ॥ పరమామృతమూ। శిరులుయశంబుబలంబుగలుగజేయు శ్రీరామనామామృతంబనవరతంబు।శ్రీరామనామామృతం । బమోఘుంబు। నరశినిర్మలమానసంబుననంతరంగమునందునురువక । యరుకగలిగిజపించువారికెల్లపుడుకైవల్యసౌఖ్యము ॥ పరమా ॥ ౧ ॥ శ్రీగౌరీభారతీవరులగలిగించిన।శ్రీరామనామామృతం। బఖండము।శ్రీరామనామామృతం।బారూఢిగ। నాగమాంతవిచారమతులై । యచలదృష్టినిబూనినిరుపమ।యోగమందుననిలుచువారికి। నెల్లకాలముభోజ్యభోగము ॥ పరమా ॥ ౨ ॥ చిరకాలమునుఆయువృద్ధినొందించును । శ్రీరామనామామృతం । బాధారము।శ్రీరామనామామృతం। బనివార్యము । పరమవైరాగ్యప్రబోధో । పరతులనుధరియించితనలో । పరమపదమునుగాంచువారికి। భవభయంబులకవుషధముయిూ ॥ పరమా ॥ ౩ ॥ శీతాంశుచండాంశుదహనులవెలిగించు । శ్రీరామనామామృతం । బస్తోకము।శ్రీరామనామామృతం। బధ్యాస్మను । ఖ్యాతిగాపంచాగ్నివేంకటశారణాచార్యునిపదంబులు । నీతితోపూజించువారికి । నిత్యశుభమునుధీప్రకాశము ॥ పరమా ॥ ౪ ॥ చెంచురామకవికిసంజీవ కారిణి।శ్రీరామనామామృతం । బచింత్యము।శ్రీరామనామామృతం । బంచితభక్తి । యుంచిసుజ్ఞాన ప్రసన్నము। హృదయగగనమునందుగలిగియు । పంచభూతంబులజయించిన । పరమమునులకు పెన్నిధానము ॥ పరమా ॥ ౫ ॥

ఆరభిరాగం - రూపకతాళం.

శ్రీరామమంత్రంబుచిత్తమలరజపయించవే । క్షీరార్ణవమధ్యంబున చేరినీవురంజిల్లుచు ॥ శ్రీ ॥ కలహంసతోగూడికమలంబులారింటెని । కలయంగనివేయురేకుల । కమలంబులోగూరి ॥ శ్రీ ॥ ౧ ॥ చండాంశుతుహినాం

శుమండలములు రెండుగలపి । అండాండము పిండాండమునం బుజాండమును జూచుచు ॥ శ్రీ ॥ ౨ ॥ యిరువైమైదింటిపైవినువీధిలోనిలచి । పరిగెత్తేటి పదిరెక్కలపక్షినిబంధించినీవు ॥ శ్రీ ॥ ౩ ॥ పంచాగ్నివేంకటపరమగురుని ధ్యానింపుచు । చెంచురామకవిననియెడిచంచలంబుమానుముయిక॥ శ్రీ ॥

నారాయణిరాగం - అటతాళం.

పరమార్థమును దెలియరా । జీవానీవు పరమార్థము ॥ పరమవైరాగ్యబోధోపరతులబొంది । ప్రణవనాదామృతరసము పానముజేశి । పరమహంసారోహకుడవై పరమపదమార్గంబు జూచుచు । పరమతారకరాజయోగభ్రాజమానమనంబుగలిగియు ॥ పర ॥ ౧ ॥ ఆధార చక్రమునందుగణనాథుని । కారునూరులహంస లర్పించినీమెందు । బాధకములగుప్రకృతిగుణముల । బాశిపృథివినిదాటి చిన్మయ । బోధచేపెంపొందినిరతము । పూర్ణదృష్టినిబూనినిరుపమ ॥ పరమ॥ ౨॥స్వాధిష్ఠానచక్రమందు పరమేష్టికి । సంతసంబుననారువేలహంసలనిచ్చి । సాధకంబున జేశిశాంభవి । సంతతముతాపత్రయముచే । వేసనొందకజలముదాటియు । విమలమనముననిరతిశయమగు ॥రప॥౨॥ మణిపూరకచక్రమందుమాధవునకు। గణియించిమరియారువేలహంసలనిచ్చి । గుణములనుమూడిటినొకటిగాగూర్చియగ్నినిదాటిక్రమముగ । ఫణిపతినిగదలించిప్రాణాపానములనిశ్చలముజేశి ॥ పర ॥ ౩ ॥ మరియునవాహతచక్రమునందున । మదనవైరికినారువేలహంసలనిచ్చి । పరమశాంతత్వమునువహించియు । పవనమునుతరియించినీలో । గురుతుతప్పకమండలాంతర । కుండలినిభేదించిచూచుచు॥ పర ॥ ౪ ॥ చిరతరంబైనవిశుద్ధకమలమునందు । జీవునకువేయుహంసలర్పించుచు । తరణిచంద్రులనంటిగగనముదాటినిర్మలమనసుచేతను । గురుతరంబగుబ్రహ్మనాడీ । కోటరంబునదూరినిజముగ ॥ పర ॥ ౫ ॥ భావించియాజ్ఞాచక్రంబుననుండేటి । పరమాత్మునకువేయుహంసలర్పించుచు । చావుపుట్టుకలేనితపమునుసల్పియంతఃకరణదాటియు । ధీవిలక్షణమైవెలింగెటిదివ్యపదమునసంచరింపుచు ॥ పర ॥ ౬ ॥ వేయుదళములుగలకమలమునందున । వేంకటగురునకువేయుహంసలనిచ్చి । మాయతోనెనయకమహోన్నత । మండలత్రయమొకటిజేశియు యేయుపాధులులేకనిర్గుణ। యోగదృష్టియుగలిగినీలో ॥ పర ॥ ౭ ॥ చెంచురామకవిననెడియహంకార । జన్యమువదలిసమరసభావమునబొంది । పంచకోశంబులనువిలయము

పరచి । చిన్మయకోశమందున । పంచభూతాతీతపరమబ్రహ్మరూపము నవధరించిన ॥పరమ॥ ౮ ॥

## యిందుస్తానిబ్యాకురాగం - ఆదితాళం.

గురుమంత్రంబునుజపముజేశనీ । కోకలలువిడువరవోజీవా । యరుకమరపులనుయరిగెడియరుకను । యెరిగియుండరావోజీవా । నిరతము శాంభవీముద్రనుబూనియునిదురమానరావోజీవా ॥ గురు ॥ ౧॥ నాదబిందుకళలైక్యమునొందె । నడితితెలియరావోజీవా । మేదినిమొదలగుభూతములైదిటి । మీదనిలువరావోజీవా॥ గురు ॥ ౨ ॥ అండపిండబ్రహ్మాండములుండెటి । కుండలిగనరావోజీవా । పుండరీకమధ్యంబుననుండే । పొలతినిబొందరవోజీవా ॥ గురు ॥౩ ॥ పరమామృతసారంబుస్రవించెటి । భాండముగనరావోజీవా । బరువడియమృతముత్రివిధదీక్షలచే । పానముజేయరవోజీవా॥ గురు ॥౪॥ పంచాక్షరములస్థానమర్మముల । పరిశీలించరవోజీవా । పంచాగ్నులవేంకటగురునాథుని । బ్రస్తుతించరవోజీవా॥గురు॥ ౫॥ పంచపక్షులకుపలుకులునేర్పక । బంధనజేయరవోజీవా । చెంచురామకవినెడియహంకృతి । జెందవలదురావోజీవా॥ గురు ॥౬॥

## దర్బారురాగము- ఆదితాళము.

గురునిగనరా । గురుతుదెలసినీవుపరమ ॥ గురునిగనరా ॥ పరమహంసనుయెక్కి । పశ్చిమవీధికి । బరచియచ్చటనున్నబ్రహ్మమందిరమునపరమ ॥ గురుని ॥ ౧ ॥ వేయుదళములుగల । విమలకమలమునందు। యేయుపాధులులేక । వెలుగుచునున్నాడుపరమ ॥ గురుని ॥ ౨ ॥ కర్మయోగములన్ని । కడకుబారగజిమ్మి । నిర్మలమూర్తివై । నిర్గుణసమాధిలోపరమ ॥ గురుని ॥ ౩ ॥ ఆదిబీజామృతమునసుభవించుచుమాయా । వాదమెల్లనుమాని । వాసుదేవుండైనపరమ ॥ గురుని ॥ ౪ ॥ దక్షిణోత్తరగిరుల । దాటియుచక్రవాక । పక్షులరెంటిగల్పి । బ్రహ్మరంధ్రమునందుపరమ ॥ గురుని ॥ ౫ ॥ అండపిండాండబ్రహ్మాండములుండేటి । కుండలీస్థానంబుకుదురుగభేదించి పరమ ॥ గురుని ॥ ౬ ॥ పంచభూతంబులపాదులువదలించి । పంచాగ్నివేంకటబ్రహ్మరూపకుడైనపరమ ॥ గురునిగనరా ౭ ॥ పంచదశాక్షరీభావముగురుతెరిగి । చెంచురామకవికిశాంతదాయకుడైనపరమ ॥ గురుని ॥ ౮ ॥

ఆహిరిరాగం - ఆదితాళం.

జ్ఞాననేత్రమునఁజూడుచిదాత్మునిమనసా । ఆనందమునొందుచు । నేనునీవనేభావమువిడుముమనసా । చిత్తోపరమంబును । బూనిసకలమునుబ్రహ్మమయంబని । పూర్ణశాంభవీముద్రనుబొందియు । లోనవెలుపలను।పరిపూర్ణంబై । లోకమెల్లవ్యాపించుచువెలిఁగెటి ॥ జ్ఞాన ॥ ౧॥ ఆరువిధములగుశాస్త్రవులనుగనిమనసా ।గురుమంత్రముచేతను।దూరమునను బంధించుక్రమంబునమనసా । ఆధారముమొదలగు । ఆరుకమలములమార్గమునను । పదియారుకళలతోనెనసినిలచి । పదినూరులదళములకమలము నందున । శారదేందురుచితోవిలశిల్లెటి ॥ జ్ఞాన ॥ ౨ ॥ ఖేదమోదములు సమముగనెంచుముమనసా । అభిమానమువిడచియు। వాదభేదములురెండునుమానుముమనసా । పరమాత్మునియెందు । నాదబిందుకళలైక్యముజేశియు । నాదిమాయలోబడివిలపించక । నాదినీయనుభ్రాంతినివదలియు వేదసారధారాసహితంబగు ॥ జ్ఞాన ॥ ౩ ॥ పంచవహ్నివేంకటగురుపదములుమనసా । సేవింపుచునిరతము । పరమరాజయోగంబునుబూనుము మనసా । సర్వంబునుమరచుచు । పంచభూతములు । పంచకోశములు । ప్రకృతిగుణములనిపరిశీలించియు । చెంచురామకవిసేవ్యమానమై । చంద్రసూర్యదహనాకృతిగలిగిన ॥ జ్ఞాననేత్రమునఁజూడుచిదాత్మునిమనసా ॥

కమాసురాగం - ఆదితాళం.

సామినిగనుగొనుమికజీవా । సతతమునుమరువక ॥ సామిని ॥ తామసాదిత్రిగుణంబులగెలచియు । దహరగగనమధ్యమునవెలింగెటి ॥ సామిని ౧ ॥ పూర్వమార్గమునదృష్టియునిలుపకగురునిదలచి । భూరివేగమునపశ్చిమవీధికిబరచీ । సర్వజగములకుమూడుకాలములసాక్షియగుచుశోభిల్లెటిదేశిక ॥ సామిని ॥ ౨ ॥ ఆశలనెడుపాశంబులనన్నిటిగోశివేశి । ఆరువిధములగుశాస్త్రవులనువధజేశి । కేశవాదిత్రైమూర్తులహృదయాకాశమందుగల్పించివెలింగెటి ॥ సామిని ॥ ౩ ॥ దేహధర్మములుసువ్రతములునిజసుఖముల్ గావూ । దేశకాలనియమంబులుజ్ఞానికిలేవూ । సోహమనెడు మంత్రాక్షరములలో । స్వప్రకాశుడైనిలచినసద్గురు ॥ సామిని ॥ ౪ ॥ పంచవహ్నివేంకటనరహరిరూపకుడైపరుడై । భక్తగణములకుశాశ్వత మోక్షప్రదుడై । చెంచురామకవికనవరతంబును । చిన్మయత్వమునపొందగజేశిన ॥ సామిని ॥ ౫॥

### ధన్యాసిరాగం । ఆదితాళం.

వేదశాస్త్రములు విసుకక చదివియు । వాదము జేశియువ్రాలినగాని ॥ లేదులేదు కైవల్యము వానికిలేశమైనజీవా । భూదేవతలకు పూజలు జేయుచు। భూదానములును జేశినగాని । లేదులేదు కైవల్యము వానికిలేశమైనజీవా। ౨ ॥ సాధకుడై యష్టాంగయోగముల । బోధగల్గి పెంపొందినగాని । లేదులేదు కైవల్యము వానికిలేశమైనజీవా॥ ౩ ॥ఆరువిడచి పదినూరులవెన్నెల। మేరుశిఖరమున మెలగినవానికి । చేరువగా కైవల్యముగలుగును । శిద్ధముగనుజీవా ॥ ౪ ॥ ధారుణిజలశుచిమారుతపురముల । దారుతెరిగివీక్షించినవానికి। చేరువగా కైవల్యముగలుగును । శిద్ధముగనుజీవా ॥ ౫ ॥ చేరికొలచిపరిశుద్ధిగవేంకట। నారశింహగురినమ్మినవానికి। చేరువగా కైవల్యముగలుగును । శిద్ధముగనుజీవా ॥

### శ్రీరంజినిరాగం - అటతాళం.

యెందుకుజీవా యీవ్రతజపములు ॥ యెందుకుజీవా । బిందువునిశ్చలమునొందియుండినమరి ॥ యెం ॥ ౧ ॥ సాక్షివినీవై సకలలోకములకుసాక్షివినీవై । మోక్షసాగరమున । మునిగియుండినమరి ॥ యెం ॥ ౨॥ మూటిని దాటి । ముందువెనకగని । మూటిని దాటి । పాటలగంధిని । పట్టిపొందినమరి ॥యెం ॥ ౩॥తన్మయ మెుంది ! దహరముశోధించి । తన్మయమెుంది । చిన్మయమూర్తిని జెందియుండినమరి ॥యెం॥౪॥ శంకలుమాని । సమరసభావమున। శంకలుమాని। వెంకటదేశికుని ।వినుతిజేశినమరి॥ యెం॥

### యిందుస్తానికమాసురాగం. అటతాళం.

శోధించరానీవుజీవా । బోధించేగురువులపూజించుజీవా ॥ శోధించరానీవుజీవా । స్వాధిష్ఠానచిదాభాసత్వమెుందక । సాధించిశాంభవీదృష్టిచేతనునీలో ॥ శో ॥ ౧ ॥ అమృతనాడీమార్గమందునవసియించి । అమృతంబుశేవించి । అమరత్వమునబొంది ॥ శో॥ ౨ ॥ మహదహంకారతన్మాత్రాతీతంబైన । దహరాకాశములోన । తన్మయమునజెంది ॥శో॥ ౩॥ నాదబిందుకళలకాదియై వెలిగెటి । యాదిపరంజ్యోతిననుదినమునునీలో ॥ శో॥ ౪ ॥ అండపిండాండబ్రహ్మాండములుండేటి । కుండలీస్థానమున ।పండువెన్నెలదాటి ॥శో॥ ౫ ॥రెంటినొక్కటిజేశి । రేయుంబగలుమూడో । కంటిచేతనీవు । గగనమునకుమీరి ॥ శో॥ ౬ ॥ ఆరుసాగరములకావలనుంన్నట్టి । క్షీరసాగరమందు ।చేరినిశ్చలమున ॥శో॥ ౭ ॥ తల్లినిబెండ్లాడిధన్య

త్వమునబొందే । చల్లనిబోధచేశాంతత్వమునబొంది ॥శో॥ ౮ ॥ తోడబుట్టినదాని । తోటిరమింకెటి । జాడదెలశిసర్వజాడ్యముల్వదలించి ॥శో॥ ౯ ॥ పంచాగ్నివేంకటపరమగురునాథుని । పంచనుబడిపరమ । పావనమూర్తివై ॥ శోధించరనీవుజీవా ॥ ౧౦ ॥ పంచభూతంబులపాదులువదలించి । చెంచురామకవివై సమరసమునబొంది ॥ శోధించరానీవుజీవా ॥

శ్రీరాగము - ఆదితాళం.

జీవుడేరా దేవుడునిజముగ । భావమందున పరిశీలించరా ॥ జీవుడేరా ॥ ౧ ॥ దేహమేరాదేవునిసదనము । సోహంభావముశోధనజేయరా ॥జీ॥ ౨ ॥ మానమేరా । మంత్రముయోగులకు । లోనవెలిలోనాలోకనజేయరా ॥జీ॥ ౩ ॥ శాంతమేరా । సకలసుగుణంబులు । చింతాపరంపరల । చిక్కుపడనేలరా ॥జీ॥ ౪ ॥ జ్ఞానమేరా । ధ్యానయోగమునీదు । మానసమెల్లబ్రహ్మమందుపొందించరా ॥ జీ ॥ ౫ ॥ శంకలేరా । సకలనరకంబులు । వేంకటార్యునివేదవాక్యంబురా ॥జీ॥ ౬ ॥

బ్యాకురాగం - రూపకతాళం.

మతములేలరా । జీవా । మతములేలరా । మతములన్నితుదకు మహా । మాయలోనేజేరురా । మతములేనిమర్మమునీ । మదిలోజూడరా । జీవామతములేలరా ॥ ౧ ॥ మూడువిధములైనచదువు । మోక్షపదవిగాదురా । మూడునొకటిజేశినీవు । మోదమొందరా ॥జీ॥ ౨ ॥ తత్వమసిమహావాక్య । తర్కముసాధించరా । సాత్వికాదిగుణత్రయమూ । సత్తుగాదురా ॥జీ॥ ౩ ॥ బ్రహ్మవిష్ణుశంకరులు । ప్రకృతిపురుషులవునురా । బ్రహ్మమందుమనసుజేర్చి । ప్రజ్వరిల్లరా ॥జీ॥ ౪ ॥ జాగ్రదాద్యవస్థలకు సాక్షివగుచునిల్వరా । నిగ్రహించియింద్రియముల । నియతిమాన్పరా॥జీ॥ ౫ ॥ పంచవహ్నివేంకటగురుపదములుపూజించరా । చెంచురామకవినటంచుజెప్పనేలరా ॥ జీవామతములేలరా ॥

తోడిపున్నాగరాగం - అటతాళం.

యెందుకుయీమోహమూ । జీవానీకూ । యెందుకుయీమోహమూ । సుందరీజనముల । జూచిభ్రమించకు । యెందెందుజూచినానేమిసౌఖ్యములేదు ॥యెం॥ ౧ ॥ తల్లిననుగనెనని । తల్లడమొందేవు । తల్లిగలిగినతల్లి । తల్లియగునేనీకు ॥యెం॥ ౨ ॥ చింతాలన్నియువిడచి । చిన్మయమూర్తివై యంతర్లక్ష్యములోననానందించగరాదా ॥యెం॥ ౩ ॥ తండ్రిననుగనెనని

తగబల్కి మురిశేవు । తండ్రిగల్గినతండ్రితండ్రియగునేనీకు ॥యెం॥ ౪ ॥ భక్తిజ్ఞానములేక । పాపస్త్రీలనుగూడి । శక్తిమాయచేత । చచ్చిపుట్టగ నేల ॥యెం॥ ౫ ॥ పశ్చిమద్వారంబుపరిశోధింపుచుబుద్ధి । నిశ్చలముగ జేశి। నిలచియుండగరాదా ॥యెం॥ ౬ ॥ బంధువుల్‌గలరని । ప్రకటించి తెలిపే వుబంధులుగలబంధుల్ । బంధులగునేనీకు ॥యెం॥ ౭ ॥ మూడుకనములు దాటి । ముమ్మూలకోనలో । యేడుకట్లభుజంగేంద్రునిగనరాదా ॥యెం ౮ ॥ దేవతాప్రార్థన । దివ్యతరమనియేవు । దేవుడుగలసురలు । దైవము తెల్లౌను ॥యెం॥ ౯ ॥ శ్రీవేంకటార్యుని । చిత్ప్రకాశముచేత । దేవతలందరు తేజరిల్లిరినీకు ॥యెం॥ ౧౦ ॥ పంచదశాక్షరిభావముగురుతెరిగి । చెంచురామకవివై । శిద్ధినొందగరాదా ॥యెం॥

కాయపురం - ఆరభిరాగము - ఆదితాళము.

యింతవిభవముగలసంస్థానమూ । వర్ణించుటకుబ్రహ్మేంద్రముఖులకైనదుస్తరమూ ॥ అంతరాయంబులులేని । ఆరుప్రాకారములుగలిగి దిగంతతేజోమయమై ఘనగంగాయమునాసారస్వతులు । మంతుకెక్కిప్రవహించగనూ । సోమసూర్యాగ్నిమండలములు తేజరిల్లగనూ । వింతలుగమ్రోగుచున్న । వేణువీణానాదములువి । శ్రాంతమైబ్రహ్మాండమెల్ల । సంభ్రమమొందింపుచుండు ॥ యింత ॥ ౧ ॥ యెప్పుడెబ్బదిరెండు । వేలవీరభటులుగొలువ । ముప్పదిమూడుకోటుల । మూలబలమునగరిచుట్టూ । కప్పుకొనివిలశిల్లగనూ । లవణాదిజలధుల । గాఢమైయొప్పుచుండగనూ । గొప్పలైవర్ధిల్లినట్టి । గోపురములిరువదినాల్గు । మెప్పుగాగనుపించిమూడు । మేడలతోమెరయుచుండు ॥యిం॥ ౨ ॥ యిరువదినల్గురుమంత్రు । లేర్పడిపరివేష్టింపగ । యిరువురునాయకులురాజ । వీధియెందుసంతతంబు । యిరువదొక్కవేలయారూ । నూరులమార్లుపరుగులెత్తుచున్నారు । యిరువదియేనుగలుమదము । లెక్కిఘీంకారములుజేయ। అరువదినాలుగుఘనవాద్యంబులుచలగుచునుండు ॥యిం॥ ౩ ॥ ద్వారములుతొమ్మిదిగలిగిక । వాటములులేకదశమ । ద్వారముగనుపించకదు। ర్వారతేజోమయమైయుండు । నూరుకోట్లసూర్యప్రభలతో । రాజిల్లుచుండు । నూత్నరత్నకవాటంబుతో । ఆరుప్రాకారములచుట్టూ । ఆరుభూతములునెగడి । భూరివేగమునపాలు । పొందసంచరింపుచుండు ॥యిం ౪ ॥ వేయునేత్రములువెలుగ । వేదవాణిగలిగిమహా । మాయతోగూడుక

యున్న । మానినిపట్టాప్రాణి । నైయనేకరూపములతోనూ । పశ్చిమ
ద్వార । మందుయున్నమేడలోపలనూ । మాయావాదులకుమహా । మం
త్రయోగులకునైన । కాయముగనుపించకని । షాంతితోప్రబలుచున్నది॥
యిం॥ ౫ ॥ మూడువిధములైనట్టిగుణ । మూలననుసరించిమించి । మూ
డువర్ణంబులునుగలిగి । ముప్పయిబ్రహ్మరాక్షసులు । మూడులోకంబు
లనుగెల్చి । పురమధ్యమందు । మూడురూపంబులనుదాల్చి । యేడుసముద్ర
ములలోన । నెల్లప్రాడుమునిగితేలి । మూడుమూర్తులనుమహామోహము
నొందించుచుండు ॥యిం॥ ౬ ॥ మూడురాజద్వారముల । ముందుగాకల
హంసయొకటిమూడువిధమూను లైవాక్య ।ములుబల్కుచునున్నదియీ।
రేడులోకంబులువినగానూ । ఆనందమున । రేయుబగలునొకరీతిగనూ।
మూడువయ్యారములుగలిగి। మోహినికన్యకలుముప్పురు । ఆడుచుపాడు
చుపురమ । ధ్యంబునదిరుగుచుందురు ॥యిం॥ ౭ ॥ లోపలిమందిరముజూ
డ । నోపలెరెవ్వారైనను । కాపురంబుజేశేరాజు । దాపుకుజేరం
గలేరు । శ్రీపతిశంకరులైనా । అష్టాంగయోగ । శిద్ధిగలుగువారలైనా।
తాపములుమూడులేని । స్థైర్యలక్ష్మిసింహాసనము । నోపిధనలక్ష్మినిగూడి
యొక్కడైపెంపెక్కినాడు॥ యిం॥౮॥తొమ్మిది మేఘములుజలగియుమ్మగపు
రవీధియెందు।కమ్మకొనియుమృతరసవ ।షమ్మగురియుచుండునిర। తమ్మ
గంభీరధ్వనులతో । ధర్మార్థకామమని ।ధానదివ్యసస్యములతో।సమ్మతము
గప్రభునిజేరి।శక్తులైడుగురుగొలిచి। యిమ్మహిజలదహనపవన ।వ్యోమము
లబుట్టింపుచుండు ॥యిం॥ ౯ ॥ నూటవక్కసైన్యమునకు । మేటియైననా
యకుడొక । బోటితోగూడుకమహానూటిగరాజద్వారంబు । దాటిరాజ్య
పీఠముననూ । అమృతాభిషేక । ధారనువర్షింపుచుండునూ । మూటి
మూటికెనిరెండు । కాటుకపక్షులుగదశి । కూటమిగలుగుచునగరిక । వాట
ముదెరుచుచునుండు ॥యిం॥ ౧౦ ॥ పురికిదక్షిణవీధికిబోయినవారలకెల్ల।
యెరుకయులేకుండుదేవ । యానమార్గమిదియెచూడ । మరియువామవీధి
యెందూ । జనువారలకు । మాటమఱువకనేయుండూ । విరివిగాపదితో
మ్మిదిగృహాము । లేర్పడికాపురముజేశె । తరుణియునొక్కతెరాజు । దా
పుకుబోవుచునుండు ॥యిం॥ ౧౧ ॥ బీజముమూలములేక ।పెరుగుచున్నవృ
క్షముల । రాజితవనమధ్యమందు । రాజువేటలాడుచుండు । యీజగంబు
లోనచిత్రమూ । జెప్పంగవశమె । యోగమాయాదేవిసూత్రమూ । రాజ

దర్శనముకు బోవ్వో । రాజవీధిబహుసూక్ష్మమై । తేజరిల్లుచునుమహారా
జయోగపథమైయుండు ॥యిం॥ ౧౨ ॥ముందుగాపట్టంపువేవి । ముంగిటని
లచి ।పరమా । నందమొందసన్నుతించి । వందనంబు జేయువారి । కం
దరికిమార్గమిచ్చునూ । ఆదిలేనివారినందరినిదూరంబుజేయునూ । యిం
దుశేఖరుని మహావిష్ణువును పరమేష్టిని । యందమైనబొమ్మలుగనాడు
కొనుచునున్నది ॥ యిం ॥ ౧౩ ॥ సృష్టికిమూలపురుషుడైశోభిలుచు
న్నట్టిరాజు । అష్టభార్యామణులతోడ । నాశ్రయించిసంతతంబు ।
యిష్టమైనభోగములతోనూ । యెడతెగకసర్వో । షు(తృ)ష్టుడైరాజ్య
మేలుచునూ । శిష్టవరేణ్యులకెల్ల । శ్రీకరుండైసంతతము:సం । తుష్ట
డైలోకంబుదివ్యదృష్టిచేచూచుచున్నాడు ॥యిం॥ ౧౪ ॥ యేడుగురురాజ
కన్యకలుమూడు,నాలుకలుగలిగి । మూడువిధములైనస్త్రాయి । తోడప్రభువు
సన్నిధిలో । పాడుచునాడుచునుందూరూ । బ్రహ్మాండమైన । మేడ
యెంచుదిరుగుచుందురూ । మూడుబంధమ్ములునుగలిగి । మూడువస్త్రంబు
లుధరియించి । యేడుభూములుఫలించే ।యోచనజేయుచున్నారు॥యిం॥
౧౫ ॥ రాత్రియుబగలునులేక । రాజునగరునిర్మలంబై । నేత్రములకుగా
నరాక । నిష్కళంకంబైయుండును । పుత్రవంతుడైనదొరనెనరూ । జగ
మందువంధ్యా । పుత్రులుగురుతెరుగలేరూ । సూత్రములేనట్టిదివ్యసుంద
రసారంబుప్రభువు । పాత్రముగధరియించి । పాలనజేయుచున్నాడు ॥
యిం॥ ౧౬ ॥ నాల్గుఅంతఃపురములందు । నాల్గువేషంబులనుదాల్చి ।
నాల్గుసుగుణములుగల్గి। నల్గురిదొరసుతులగూడి । నల్గురుసామంతవీరులూ
కాలత్రయమున ।గల్గియున్నవ్యాపారంబులూ । నాల్గుధర్మములుమరియు।
నాల్గుఆశ్రమములు జేశి । నాల్గుఫలపురుషార్థములు।నటనలుయేర్పరచినా
రు ॥యిం॥ ౧౭ ॥ నగరికికావలియున్న । నాయకుల్ పదిఆయిదుగురిలో।
మగటిమిగలవాడొక్కండు । మానవేంద్రునికిమాతామె । పగలురాత్రు
లునువారూ । పురమందుజేరి । బాణవిద్యనేర్చుచున్నాడూ । మృగపతి
వాహనమునెక్కి । పగతులజేరనీయకఖగపతియస్త్రంబుచేత । ఖండన
జేయుచున్నాడు ॥యిం॥ ౧౮ ॥రాజుదర్శనంబుజేశి । రాగలందులకునొ
క్క । తేజినెక్కివేగమునవెయ్యోజనములుబోవలయును।యీజగంబులో
ననెవరైనా । మహనియ్యులున్న । రాజయోగశిద్ధాంతంబునా । పూజని
య్యమైనచిత్ప్రబోధవైరాగ్యోపరతుల । తేజరిల్లుచున్నవారి । దేశమే

యీ దేశమౌను ॥ యింత ॥ ౧౯ ॥ రెండునాగస్వరనాదముల । రేయుబ
గలుమ్రోవకుండ । కుండలికక్తినికదల । కుండదృఢతరముగనిల్పి । అండ
పిండబ్రహ్మాండములనూ । మ్రింగినబ్రహ్మ । దండివిశేషములోనలక్ష్యమునూ
నిండజేశిసహస్రారపుండరీకమెక్కి-నిల్చి । యుండిచూచినవారికియీపురం
బుగానబడును ॥యిం॥ ౨౦ ॥ తల్లికిజన్మించిమరల । తల్లినెరమియించిపిన
ప । తల్లియోనిపరిక్షించె । ధర్మశాస్త్రములువిడచి । యెల్లలోకములునె
ల్లా । యేలినగురుని । యోగమార్గములవల్లా । ఫుల్లమువిశ్రాంతినొంది।
ఒక్క-వాక్యమనుసరించి । చల్లగాజూచువారికిసాధ్యమౌనుయీనగరంబు
యిం॥ ౨౧ ॥ తొంబదియారుగుర్రముల । తోటియున్నరథమునెక్కి-। అం
బరవీధినిదాటి । ఆదిభీజామృతగోళి । శాంభవీసూత్రముధరియించి। క
మలగర్భాది । స్తంబపర్యంతంబుపీక్షించి । బింబప్రతిబింబములగెంటి ।
బిందుమధ్యమందుజేర్చి । బింబరహితమునుజేశి । ప్రేమతోబూడంగవల
యు ॥ యిం ॥ ౨౨ । కర్మమార్గములవిడచి । కామమువజించిలోక ।
ధర్మములన్నియుమాని ధైర్యమవలంబించిమనసు । నిర్మలంబుగానుజేశి ।
తత్త్వమసీవాక్య । మర్మమెల్లనుదలపోశి । కర్మనేత్రద్వయముమూశి । జ్ఞా
ననేత్రమునుదెరచి । నిర్మలులైయున్నవారు । నేర్పుగాబూడంగగలరు ।
యింత ॥ ౨౩ ॥ పంచదశిమంత్రార్థమెరిగి । ప్రకృతినిమారంబుజేశి ॥
పంచకోశములనువిడచి । బ్రహ్మమందుమనసుజేర్చి । పంచవహ్నివేం
కటార్యుని । పాదాబ్జములనుతి । యించిప్రాపంచంబులేదనీ । చెంచురా
మకవినేనసే । చంచలత్వంబునుమాని । పంచభూతములనుగెలిచె । పావ
నులకీపురిసాధ్యంబు ॥ యింతవిభవముగలసంస్థానమూ । వర్ణించుటకుబ్ర
హ్మేంద్రముఖులకైనదుస్తరమూ ॥ ౨౪ ॥

సాయిరిరాగము-ఆదితాళము.

రామచంద్రసద్గురునిభజించవేమనసా । వినయంబునతారక। రా
జయోగమార్గంబునపొందవేమనసా । విశ్రాంతియుగలిగియు । భూమిస
లిలవైశ్వానరపవన । వ్యోమములకుపైనున్నమహోన్నత । సోమసూ
ర్యమండలములనడుమను । చూపునిల్పియానందమునొందుచు ॥ రామ ॥ ౧
నీలమేఖమండలమధ్యంబునమనసా । ఓంకారనినాదము। నిశ్చలముగనాలిం
చుచునుండవేమనసా । సర్వాత్ముడుడానై । కాలదేశనియమంబులులేక ।
నఖండసచ్చిదానందమయుండై । నీలకంఠవైకుంఠవిధాతల ।నిలయములకు

ప్రభువైరాజిల్లెటి ॥ రామ ॥౨॥ నాల్గువేదములసారాంశంబునుమనసా।ద లపోయుచుపరమా । నందమొందివిభ్రాంతినివిడువవేమనసా । నిష్కామ మునొందియు । నాల్గుగతులవిహరించకనీలో । నాల్గుత్రోవలునుగలసిన చోటను । వెల్గుచున్నమాణిక్యపురంబున । విశ్వరూపధరుడైవిలశిల్లెటి॥ రామ ॥ ౩ ॥ రెండురూపములనొక్కటజేయవెమనసా । సౌషుమ్నబిలం బున । గేయుబగలువీక్షింపుచునుండవేమనసా । పరిపూర్ణసుధామయ। భాండమందువర్తించెటిఘనతర । కుండలీంద్రపర్యంకమునందున । అండ పిండబ్రహ్మాండంబులకున । నాదియొగుచుపరుడైశోభిల్లెటి ॥ రామ ॥ ౪ ఆరుసాగరంబులనుతరించవేమనసా । శాంభవినిధరించియు । క్షీరజలధి లోతపమొనరించవేమనసా । అత్యున్నతమగుశ్రీ । మేరుచక్రమధ్యంబున ప్రకృతికి, మిగిలిశుద్ధసాత్వికుడైనిరహం । కారనిర్మలాత్మకుడైగగనా । కారుడగుచుభాసిల్లుచునుండెటి ॥ రామ ॥ ౫ ॥ పారతంత్ర్యభావమ్మున పొందవేమనసా । త్రైలోక్యవిమోహన । పద్మగంధితోజెనగకనుండవే మనసా । యేకాంగివినీవై । ఘోరదురితసంసారమహాంబుధిచేరిదానిలో బడివిలపించక । నీరుపాలువిభజించియునాగ్గురి । పోరుమాన్పినీలోపల నుండెటి ॥ రామ ॥ ౬ ॥ దేహధర్మగుణములవర్జించవేమనసా । మానం బువహించియు । దివ్యదృష్టితోనవలోకించవేమనసా। సూత్రాత్ముడుదా నై । సోహమనెడునుంత్రాక్షరములకును । దేహధారియైగురుతరహంస ను । వాహనంబుగాజేకొనిత్రిభువన । వాసుదేవబ్రహ్మంబైమెరశెటి ॥ రామ ॥ ౭ ॥ ఆదిబీజమకరందముగ్రోలవేమనసా । గురుమంత్రముచేతను ఆత్మయజ్ఞదీక్షనుధరియించవేమనసా । సంకల్పముమానియు । ఖేదమో దములుసమముగనెంచుచు । కేవలాత్మజీవైక్యసమాధిలోనీదువృత్తిలయ మొందగనిలచియు । వేదములకుమూలంబైవెలిగెటి ॥ రామ ॥ ౮ ॥ మూ డునదులుగలశినమార్గంబునమనసా । స్నానంబొనరించుచు । మూడుల క్ష్యములచేతనుజూడవేమనసా , అంతర్ముఖమొందియు । మేదుజగముల నుతనలోనుంచుక । యోగమాయతోక్రీడయునలుపుచు । మూడుతనువు లకుసాక్షియుదానై । మోక్షరాజ్యసంస్థానముగలిగిన ॥ రామ ॥ ౯ ॥ సర్వకార్యములుమరచుచునుండవేమనసా, అచలత్వనొందియు । సత్యవా క్యసంధానముజేయవేమనసా । కాలత్రయమందున। నిర్వికారుడైనిరుపా ధికుడై । నిర్విశేషుడైనిత్యనిరంజన । నిర్వికారనిరవధికతేజుడై । నిత్యశు

ద్ధపరిపూర్ణుండగుశ్రీ ॥ రామ ॥ ౧౦ ॥ పంచకోశములభ్రాంతిననిడువవే మనసా । తాపత్రయములచే। పట్టుబడక వైలక్షణమొందవేమనసా ।యోగీశ్వరుడగుశ్రీ । పంచవహ్నివేంకటనరసింహుడై । బ్రహ్మాదండినాళాంతరమందున । మించిస్వప్రకాశుండైనిరతము । చెందుచురామకవినేలుచునుండెటి । రామచంద్రసద్గురునీక్షించవేమనసా । వినయించునతారక । రాజయోగమార్గంబునపొందవేమనసా ॥ ౧౧ ॥

కమాజురాగం - ఆదితాళం.

రామనామామృతమూ । త్రిభువనపరమసుఖము । రామనామామృతము । కామరాగముఖ । గుణగణశమనము । గరుడగమనశివధ్యహిణశుభకరము । రామ ॥ సోమసూర్యమైశ్వానరమండలగతమూ । పరమూ । సుజననికరతాపత్రయభయపరిహితము । ప్రేమతోడభుజయించినవారికి । బింపునిశ్చలముజేసెటిసురసము ॥ రామ ॥ ౧ ॥ సకలయోగసాధకులకుభవతారకము । ఘనము । సర్వవేదవిజ్ఞానసుదీపాంకురము । ప్రకటపరాపరప్రకృతినిధానము । బ్రహ్మరంధ్రపరిపూర్ణప్రవాహము రామ ॥ ౨ ॥ భువనసృజనపాలనలయకారణము । ధ్రువము । పుణ్యపాపకర్మాత్ములకతిదుర్లభము । నవవిధరసములుగలిగియుసుమనస । నాయకముఖులకునిత్యజీవనము ॥ రామ ॥ ౩ ॥ గురుతరనీలపయోధరమధ్యోద్భవము । ముదము । కోటిబ్రహ్మయజ్ఞవ్రతశిద్ధిప్రదము । గురుమతమునుదెలిశినబుధవరులకు । కోర్కెలెల్లఫలియించెటివషణము ॥ రామ ॥ ౪ ॥ ఘోరదురితసంసారభయనివారకము । బలముకుండలీంద్రమస్తకగతఘనసాగరము । నారదాదివీణామృతగానము। నవవిధశక్తులకాదిభౌతికము॥ రామ ॥ ౫ ॥ విలసదనాహతనాదానుభవఫలవ్రతము । ధనము । విమలసుషుమ్నాంతరసుసరోవనము । కులములభేదముతేజగములకు । కులమతములుగలిగించినసారము ॥ రామ ॥ ౬ ॥ అండపిండబ్రహ్మాండములంటనిస్థలము వరమూ ఆదిశక్తికాధారనిధానాస్పదము । పంచుపెన్నెలకుమించినవర్ణము । బరగినబ్రహ్మానందానుభవము ॥ రామ ॥ ౭ ॥ పరమసూక్ష్మతరతారకవిమలాంజనము । స్థిరము । పంకజములకారించికి । వైరాజితము । స్థిరవైరాగ్యముబోధయునుపరతి । శిద్ధించెటినిజమహదైశ్వర్యము ॥ రామ ౮ ॥ అష్టశరీరంబులువదిలెటిరసము। సుఖము । అపరిమితంబుగపొంగుచునుండేజలము । సృష్టియుగలిగినసృష్టియుజెరిగిన । సృష్టినశించినతరగని

రూపము॥ రామ ॥ ౯ ॥ పంచాగ్నుల వేంకటగురుచరణోద్భవము। స్ఫుటము పంచయజ్ఞసౌభాగ్యఫలప్రదపదము। చెంగు రామదాసునిరక్షించిన। చరమరూపసవిశేషవిలాసము। రామనామామృతము ॥ ౧౦ ॥

కాపిరాగము - అటతాళము.

యిదిగోరగురుకీలకము। జీవ। యిది యేరాయోగతారకము। కదలకనచలమైనిలచియున్నదిరా। కనులకుమనసుకుగోచరించదురా। నిదురజాగ్రతస్వప్నములనుజెందదురా। నిర్మలాకాశమువలెనుయున్నదిరా। పదిలముగాజ్ఞాన। దృష్టిచేజూచితెసరిపూర్ణమైసర్వమునుతానైయున్నది। యిది ॥ ౧ ॥ చీకటివెల్తురుగాకయున్నదిరా। చిత్కళాకాశమునంటకున్నదిరా। లోకాలోకములుతనలోనయుంన్నవిరా। ఆకారనామముల్ లేకయున్నదిగా। ఆకాశవాయువులగ్నిజలభూములు। సోకకనిర్మలమైవెలుగుచున్నది ॥ యిది ॥ ౨ ॥ హేతుదృష్టాంతరహితమైయున్నదిరా। యేకాలముననొకరీతినున్నదిరా। జ్యోతులన్నియుదానిలోననణగునుగా। చూపుచెప్పడముకుగురుతుదెలియదురా। ధాతకేశవరుద్రేంద్రాదిరూపభ్రాంతి। నీతిలేకనునిరుపమానంబైయున్నది॥ యిది॥ ౩ ॥ యరుకమరపులురెండులేకయున్నదిరా।యోగాభ్యాసులకైనగనదుర్లభమురా। పరమరాజయోగులకుసాధకమురా। పరమరహస్యమైబరగుచున్నదిరా। గురుమహావాక్యార్థసారవిశేషమై। గుణధర్మశూన్యమైనిత్యమైయున్నది ॥ యిది ॥ ౪ ॥ జీవేశ్వరభ్రాంతిలేకయున్నదిరా। చిత్సుఖరూపమైనిలచియున్నదిరా। వాభావాతీతపదమైయున్నదిరా। బంధమోక్షంబులులేకయున్నవిరా। చావుపుట్టుకయునురాకపోకలులేక। యేవిచారములేకవిలశిల్లియున్నది ॥ యిది ॥ ౫॥ ఆదిమధ్యాంతశూన్యంబైయున్నదిరా। అన్నిదిక్కులయెందునిండియున్నదిరా। నాదబిందుకళలులేకయున్నదిరా। నశియింపులేకనిర్లేపమైనదిరా। వేదశాస్త్రములకైనయోగులకైన। యరిగియుండుటకునతిగూఢమైనది ॥ యిది ॥ ౬ ॥ కాలదేశదోషంబులనుపొందదురా। కానరాకనుశూన్యంబమ్యోయున్నదిరా। నీలపీతాదివర్ణములులేనిదిరా। నిష్కళంకమైస్వచ్ఛమయివున్నదిరా। లీలామాత్రమైవనిఖిలజగంబులు।లీనమైనగానియొకరీతినున్నది ॥ యిది ॥ ౭ ॥ పంచభ్రాంతులులేకప్రబలుచున్నదిరా। ప్రకృతివికృతులకునంటకుంన్నదిరా। పంచాగ్ని వేంకటగురునిరూ

పము రా । పంచబ్రహ్మలకైనపట్టరానిదిరా । పంచకోశంబుల భ్రాంతిరహితమైతె । బట్టబయలు గానుగనుపించుచున్నది ॥ యిది ॥ ౮ ॥

దేశియ్యం. ముఖారిరాగం॥ అటతాళం.

సోమసూర్యాగ్నులను నిరతము। స్వప్రకాశముతోడ నిలిపిన దేవునీగన రామదినీ॥ ౧ ॥ మూడునదులునుగలయుచోటను । మణిగిశుచియై ముక్తికాంతను । గూడరా । నీలోజూడరా॥ ౨ ॥పరమశూషుమ్నాంతరంబున । పండువెన్నెలకీతివెలిగెటి దేవునీ । గనరామదినీ ॥౩ ॥ మూడవస్థలయందుమునుగక । మూడురూపంబులుధరించకనిల్వరా । రిపులగెల్వరా ॥ ౪ ॥ కుండలీస్థానంబునందు । నజాండకోటినినిల్పియుండినదేవునీ । గనరామదినీ ॥ ౫ ॥ ఆదిబీజామృతసముద్రము । నందుక్రీడయుసల్పియమృతముగ్రోలరా । జపమూచాలురా ॥ ౬ ॥ రెండువకటైనిల్చినప్పుడు । రేయుబగలునులేక వెలిగెటిదేవునీగనరామదినీ ॥ ౭ ॥ వేయుదళములకమలమందున। నేకదృష్టినిబూనిమనగురినిల్పరా । తపముసల్పరా ॥ ౮ ॥ వేంకటేశ్వరగురుడుతానై । విశ్వరూపంబునుధరించినదేవునీ ।గనిరామదినీ ॥ ౯ ॥ చెంచురామకవీంద్రునికికరు । ణించియుపరతిసుఖమునిమ్మనివేడరాకొనియాడరా ॥ ౧౦ ॥

జంఝూటిరాగం- రూపకతాళం.

శాంతముధరియించరా । చిత్తచలనమునణగించరా । అంతరంగమందూగురునీచింతించిపూజించరా ॥ ౧ ॥ కామమువిడిపించరా । సర్వకలుషంబులనుద్రుంచరా । సోమసూర్యాగ్నులనడుమజ్యోతినిదర్శించరా ॥ ౨ ॥ యేడుజలధులుదాటరా । పదియేడింటినిమీటరా । మూడునదులలోస్నానము । ముఖ్యముగాజేయరా ॥ ౩ ॥ అమృతంబుసేవించరా । అణిమాదులధరియించరా । సామ్రాజ్యభోగమునొంది । సత్యముశోధించరా ॥ ౪ ॥ నీవువచ్చినమార్గమూ । జీవా । నిజముగగురుతెరుగుమూ । నీవుబోయ్యేదారియేదో । నేమమూతోబూనుమూ ॥ ౫ ॥ పంచవన్నెలచిలుకరూ । పెక్కుపల్కులుసేర్పించరూ । పంచాగ్నులవేంకటగురునీ । పంచనుయెడబాయకరూ ॥ ౬ ॥ చెంచురామకవివై । శివపంచాక్షరజపభోగివై । పంచకోశాతీతమైనా । భావసామ్రాజ్యుడవై ॥ శాంతముధరియించరా । చిత్త । చలనమునణగించరా ॥

పంతువరాళిరాగం - అటతాళం.

యింతకన్నసుఖముయేదిరా । వోజీవనీకు । యింతకన్నసుఖముయేది రా ॥ సంతతంబుచిత్తవిశ్రాంతి[illegible]ంది । జ్ఞానదృష్టి । నంతరంగమందునిల్పి । యచలుడైధ్యానించవలయు ॥ నింత ॥ ౧ ॥ వాదభేదములనువిడువరా । నారీమణుల । మీదవాంఛమానియుండరా । నాదబిందుకళలనెరిగి । నాగకన్యకనువరించి । వేదసారమనుభవించి । విమలబోధనొందవలయు ॥ నింత ॥ ౨ ॥ కాపురంబునిల్పియుండరా । యచ్చాళ్ళకైన । రూపముశాశ్వతముగాదురా । చూపుమనసునొకటిజేశి సూర్యచంద్రులనడుమునిల్చి । శ్రీపరాపరునిగాంచి । చిన్మయత్వమొందవలయు ॥ నింత ॥ 3 ॥ యేడుప్రాకారములుదాటరా । నీలోనయున్న । మూడుపర్వతములమీటరా । మూడుగుణములనుహరించి । ముజ్జగంబులనుసృజించి । మూడువిధముతైనదాని । మూలమెల్లనెరుగవలయు ॥నింత ॥ ౪ ॥ మదగజంబులనువధించరా । నీలోనయున్నపదితురంగములనిల్పగా । పదిరథాంగములుగలుంగు । రథమునెక్కి-జగములన్ని । వదలినిశ్చలమునపరమ । పదమునందుజేరవలయు ॥ నింత ॥ ౫ ॥ పంచకోశములతరించరా । యెల్లప్రపుపనిప్ప్రపంచభావమొందియుండరా । పరవహ్నివేంకటార్యు । పాదపద్మములుగొల్చి । నెంచురామకవికియోగశిద్ధిగలిగమెరయవలయు । నింతకన్నసుఖముయేదరా । వోజీవనీకు । నింత ॥ ౬ ॥

యిందుస్తానిబ్యాకురాగం - ఆదితాళం.

యీరహస్యమునుయెరిగినమనుజుడు । యోగపురుషుడో వోజీవా । నీరుపాలుమిళితంబైయున్నది । నీరుపాలువిభజించగనూ । ధీరత్వమునేలాగునగలుగునో । తెలియవలెనురా ॥ వోజీవా ॥ యీ ॥ ౧ ॥ సప్తప్రాకారంబులుగలిగిన । సాగరమొక్క-టియున్నదిరా । సప్తప్రాకారంబులుదాటియు । సాగరమునస్నానముజేశి । సుప్తిజాగ్రతయుస్వప్నములేని । సుఖమునొందవలెవోజీవా ॥ యీ ॥ ౨ ॥ మూడుపిశాచంబులచేనెప్పుడు । మోసపోయిమదిచెదురునురా । మూడంజనములునొక్క-టిజేశియు । మూలమంత్రమునమంత్రించి । మూడుపిశాచంబులదొలగించియు । ముదమునొందవలెవోజీవా ॥ యీ ॥ 3 ॥ యెనిమిదిపొరలునుగలపండున్నది । యేరుచినున్నదోవోజీవా । యెనిమిదిపొరలునుదీశినపిదపను । యేవర్ణతోనున్నదియో । మనసునిల్పిదానినిభక్షించియు । మా

స్యుడుగావ లెవో జీవా ॥ యీ ॥ ౪ ॥ పడిగెయు క్రింద్రైతోకయుఘీ్రదె । పా ముయొక్కటియున్నదిరా । వడిగలజిహ్వలుమూడుగలిగియును । వకని ముషంబైననుతనలో । వెుడతెగకనుబుసపెట్టుచునుండును । పాడిచిలే పవలెవో జీవా ॥ యీ ॥ ౫ ॥ క్షీరసముద్రములోపలబంగరుసారసము న్నదివో జీవా । సారసనాళంబునగలిగినచి । త్సారామృతమును శేవించి। మారణదశయును దొలగియుఘనధీ । మంతుడుగావలెవో జీవా ॥ యీ ॥ ౬ ॥ పంచాగ్నులవేంకటగురునాధుని । ప్రస్తుతించవలెవో జీవా । చెంచు రామకవినెనెడియుహాంకృతి । జెందవద్దుయెల్లప్పటికి। పంచాగ్నుల తేజంబు లొక్కటిగభావించగవలెవో జీవా ॥ యీ ॥ ౭ ॥

ఆరభిరాగం - అటతాళం.

గురుశేవజేయగవలెరా । జీవ । పరిపూర్ణజ్ఞానదృష్టినినిలుపవలెరా। ని రుపమసుఖమొందవలెరా ।జీవ। పరమవైరాగ్యప్రబోధాపరతులనుబొం దియు ప్రపంచము । మరచిస్సిర్గుణతత్వమందున । మనసులయమును జేయు టకు శ్రీ ॥ గురు ॥ ౧ ॥ కాముని గెలువంగవలెరా ।హంస। గామినితోగూ డివిలశిల్లవలెరా । నీమానసమునిల్పవలెరా ।జీవా। భూమియుదకములగ్ని వాయువు । వ్యోమమునగలిగించి । నణచెటినీమమెవరికిగలిగియుండునో। నిశ్చయముగనుదెలియుటకు శ్రీ ॥ గురు ॥ ౨ ॥తన్మయత్వమునొందవలెరా। జీవా । దహరాకాశములోనచరియింపవలెరా । చిన్మయాత్మునిగనవలె రా । జీవా।జన్మమరణంబులువహించని । శాశ్వతంబగుపదవిగలిగెటి।స న్మనీశ్వరమతముసతతము ।సాధకంబునుజేయుటకు శ్రీ ॥ గురు॥ ౩ ॥పంచ భ్రాంతులువిడువవలెరా ।జీవ। లాంచనంబులునీవుసమయించవలెరా । పంచబ్రహ్మలమించవలెరా । జీవా । పంచకోశంబులనువిలయము । పర చియంతర్ముఖముగలిగియు । చెంచురామకవీంద్రునికిఘన । శాంతచిత్తము గలుగుటకు శ్రీ ॥ గురుశేవజేయగవలెరా॥

కల్యాణిరాగం - అటతాళం.

తనువునిత్యముగాదురా । జీవానీజీవనముస్థిరముగాదురా ॥ ఘన మైనరామతారకనామమంత్రము। ననిశముజపియించియానందమొందరా॥ తనువు ॥ ౧ ॥ మూడుచదువులుమానరా । మాయలోన । మునిగియుండ నేలరా । మూడుఅక్షరములునొకటిగైయున్నట్టి । మూలాక్షరమునె రిగిమోక్షమునొందరా ॥ తనువు ॥ ౨ ॥ ఆరుఘూములుదాటరా । పశ్చి

మ దేశమందునిల్పిచూడరా । మేరుచక్రమునందుసంచరింపుచునుండె । మేచకాంగినిగూడివేధత్వమొందరా॥తనువు ॥ ౩ ॥ సాధనాంతరమేలరా। సర్వంబునకుసాక్షివైవిలసిల్లరా । వేదశాస్త్రములువెన్నాళ్లుజదివిన । బాధోపరతులతొబోలగలేవురా ॥ తనువు ॥ ౪ ॥ అధాతురముమానరా । నిరతముపరమానందంబునను జెందరా । తీర్థయాత్రలకేపుడు । దిరిగితిరిగినీవు । దీనత్వమునజెంది । డిటవుదప్పకనేల ॥ తనువు ॥౫॥ గురిలేని జపమేలరా । శ్రీవేంకట । గురునినమ్మియుండరా । యిరువదియొక్కవేలారునూరులసంఖ్య। గురుమంత్రజపమును। గురుతెరిగియుండర॥తనువు॥౬॥

కమాజురాగం - అటతాళం.

రాజయోగీంద్రుడౌ । జీవామహారాజ । యోగీంద్రుడౌ । యీజగమందున । నెల్లప్పటికిగురుని । పూజజేయుచుతనలో బుద్ధినిల్పినవాడె రాజయో ॥ ౧ ॥ రాగద్వేషభయాలజ్జామోహములను । శ్రీగురుమంత్రంబుచేతనణచినవాడె ॥ రాజయోగీంద్రుడౌ ॥ ౨॥ మనసువాయువునొక్కమార్గమునను జేర్చిమనసుబ్రహ్మమునందు । మరగజేశినవాడె ॥ రాజ ॥ ౩ ॥ పైకికిందికినెగసి । పక్షినిబట్టుక । లోకాలోకములువిలోకించినవాడె॥ రాజ ॥ ౪॥ మూడుఅక్షరములమూలముగురుతెరిగి । మూడునదులలోన మునిగితేలినవాడె॥ రాజ ॥౫॥ కుండలింద్రునిబట్టి। కదురుగపైకెత్తి। మండలత్రయమందుమరగిచూచినవాడె ॥ రాజ ॥౬॥ అండపిండాండబ్రహ్మాండంబులనుబిందు । మండలమందునమాయజేశినవాడె ॥ రాజ ॥ ॥ అమృతనాడీరంధ్రమందువ్యాపించిన । అమృతరసముగోలిఆనందించినవాడె॥ రాజ॥ ౭ ॥ కస్తూరిపడుచుయెందుగలిగినగంధము । ధన్యుడైతనయందుధరియించినవాడె ॥ రాజ ॥ ౯ ॥ పంచాగ్నివేంకటపరమగురునిజేరి । పంచదశాక్షరిపఠనజేశినవాడె ॥ రాజ ॥ ౧౦ ॥

ధన్యాశిరాగం - ఆదితాళం.

బ్రహ్మమునెరిగినధన్యుడునిరతము । పరమపురుషుడై వెలుగునయా బ్రంహ్మమునెరుగనిమానుషమహిషము । బ్రతికిచలంగగనేలనయా ॥బ్ర ॥ ౧ ॥ బంధమోక్షములునెరిగినమనుజుడు । పండితుడనికొనియాడవయా । బంధకవిశ్వముచెప్పెడినీచుడు । పరమశుంఠయనిదూరవయా ॥ బ్ర ॥ ౨ ॥ కామమునువిడిచినఘనుడువరదుడని । కడుభక్తినిపూజించవయా । కోమలికౌగిటచిక్కినయధముడు । కుష్టురోగియనితొలగవయా ॥ బ్ర ॥ ౩ ॥ అ

మృతపానమును జేసిన ధీరుడు అమరేంద్రుండని యెంచవయా ।అమృతరసము
వర్జించినదుష్టుడు ।అతికాముకుడని పల్కవయా॥ బ్ర ॥ ౪ ॥గురువులగుణ
ములు యెంచినహీనుని । గుణముబ్రణంబని తెలియవయా । గురువులగుణ
ములుసన్నుతిజేశిన । గుణుడు గురుండని యెరుగవయా ॥ బ్ర ॥ ౫ ॥ ప్ర
తినిమీషమును తన్మయమొందని । మతిదుర్గతి గని దలచవయా । ప్రతినిమీష
మును తన్మయమొందెటి । మతిసద్గతియని పొందవయా ॥ బ్ర ॥ ౬ ॥ వేం
కటగురువరునమ్మినసుమతియు । వేదాంతియునని జెప్పవయా ।వేంకటగు
రుదూషకుడగు పతితుడు । యమపురాంత్రియని చాటవయా ॥ బ్రహ్మము
నెరిగినధన్యుడు ॥ ౭ ॥

యిందుస్తాని కాపిరాగం-రూపకతాళం.

గురుమంత్రదీక్ష।గోరిముక్తినొందరా। జీవా।గురుమంత్రదీక్షగోరి
ముక్తి ॥పురములనుమూటిని సహించి।ఘ్రాణదృష్టిజూడరా । పరమహం
సనుగూడరా । కర్మబంధము విడనాడరా జీవా ॥ గురు ॥ ౧ ॥ మండలము
లుమూడుగడచి । మనసులయముజేయరా । అండము భేదించరా।యమృ
తాంగనువరియించరా జీవా ॥ గురు ॥ ౨ ॥రెండునొక్కటిజేశిజ్యోతిర్మం
డలమును జూడరా । పండువెన్నెలగోరరా । బ్రహ్మాదండిబిళముదూరరా
జీవా ॥ గురు ॥ ౩ ॥ పంచవహ్ని వేంకటగురు పాదపద్మమునమ్మరా ।
వాంఛలుయికజాలురా । లోకవాసననీకేలరా జీవా ॥ గురు ॥ ౪ ॥ చెం
చురామకవివిసీకుచిత్తచలనమేలరా । పంచవన్నెలువిడువరా । నిష్ప్ర
పంచయోగముబూనరా జీవా॥గురుమంత్రదీక్షగోరిముక్తినొందరా జీవా ॥

కల్యాణిరాగం- ఆదితాళం .

జీవాయీచోవా । గనుటకుగురుశేవజేయగలేవా । యీవసుంధ
రసలీలపావకగగనముల్ । యేవిభుకృతమున వెలుగుచున్నవో చూడు ।
భావములరనీవుం । మరిసి । తావుదెలియలేవు । భువనా । భావమైనపరి
పూర్ణభోధచే । నీవుదెలియవలెనిశ్చలమనమునవో ॥ జీవా॥ ౧॥వండాం
శుసోమమండలములు రెండునొకటిజేయరా । అండపిండాండబ్రహ్మాండ
ములనువ్యాప్త్వ । కుండలీస్థానమున । కుదురుగనున్నవి । నిండుమనసు జే
శి । నీవా । మండలమునుదాశ । విలసదఖండచిన్మయానందయోగమున।
నుండిచూడవలెను పరతిసుఖమునుగని ॥ జీవా ॥ ౨ ॥ నేడుభూములుదా
టియుపద । యేడిటినివీడరా । మూడు [illegible]రములమూలముగురుతెరిగి ।

మూడువక్రములుగల । మోహనాంగినిబెనగి । మూడునదులలోనూ । ముణిగియునూడువిడువవలెనూ । జిహ్వాలు మూడుగలిగినడినాడీబిలమున । నాడుడున్న భుజగాధిపుగనవలెవో ॥ జీవా ॥ ౩ ॥ ఆరుకొండలుగడచీ । మహాంమేరుగిరిని జేరరా । భూరిసహస్రసారసమందునమృత । సారముగ్రోలిపరవశత్వమునను జెంది । కారణగురుడైనా। వేంకటనారశింహు కరుణా । మృతఘననీరధిలోబడినిర్మలమతివై । ధారణాదిసాధనములుగనవలెవో ॥ జీవా ॥ ౪ ॥ భువిలోవెల్లాలచెంచురామ । కవివైతేజరిల్లరా భవరోగగణములబాశి । నిష్కర్మివై శివయోగమునుపూనిచిత్తవిశ్రాంతి నొంది । నవవిధద్వారములూ । గలిగిననగరము రేఖగలూ ।వదలని । నవసూత్రంబులననుసరించిఘన । పవనునితోడను । ప్రబలించెనువో జీవా । యీదోవా । గనుటకు । గురుశేవ జేయగలేవా ॥

భైరవిరాగం - అటతాళం.

రామబ్రహ్మానందసాగరమీదవె । కామమేలనేమనసా । సోమసూర్యాగ్నిమండలములునీలోన ।శోధించవెమనసాసంతతముశ్రీ॥రామ॥౧॥ రాజయోగసమాధిలోనిదురజెందుచు । రాజిల్లవేమనసా । యీజగజ్జాలములన్నిభ్రాంతియనియోచించవేమనసా । సంతతముశ్రీ ॥ రామ ॥ ౨॥ బిందునిశ్చలంబుజేశిధ్యానించవే । సందడెందుకుమనసా । బిందువుయచలమైయుండకున్ననిన్ను । క్రిందుపరచుమనసాసంతతముశ్రీ ॥ రామ ॥౩॥ కళలన్నినీలోనిష్కళమెంచుగలుపవే । చలనమేలనుమనసా । విలసితసౌషుమ్నబిలములోపలనున్న । చెలినిపొందవెమనసాసంతతము ॥ శ్రీరామ॥ ౪ ॥ ఆరుకమలములకుతుదనున్నకమలములో । సారముగనుమనసా ।దారిదప్పకనీవుగగనంబునకుమించి । దహరాకాశముబూడవేసంతతముశ్రీ ॥ రామ ॥ ౫ ॥ నాదములన్నియునాలించినిలువవె । భేదమేలనుమనసా । నాదములన్నిటిలయముజేశిప్రణవ । నాదమువినుమనసా । సంతతముశ్రీ। రామ ॥ ౬ ॥ అంతర్లక్ష్యంబునవలబించిచిత్తవిశ్రాంతినొందవెమనసా।చింతాసముద్రంబులోనమునిగినీవు । చెడనేలనేమనసాసంతతముశ్రీ ॥రామ॥ ౭ ॥ వటబీజరంధ్రంబులోనగజముండెటివైపుగనవేమనసా । నిటలతలంబునదృష్టియునిలిపిత్రి । పుటిబాయువేమనసాసంతతముశ్రీ ॥ ౮ ॥ పంచాగ్నివేంకట । పరమగురునాథుని । బ్రస్తుతించవేమనసా। చెంచురామకవివై నిత్యనిర్మలమైన । శిద్ధినొందవెమనసాసంతతముశ్రీ ॥ రామ ॥౯

దేశీయముఖారిరాగం-అటతాళం.

శ్రీసదాశివయోగమెరుగక।చిత్రముగరచియించువానిప్రబంధమూ కలుషబంధమూ ॥ ౧ ॥ యింద్రియంబులశాంతిపరచక । యోగిననిబోధించువానిసుశీలమూ । హాలాహలమూ ॥ ౨ ॥ మూడువిడువకతన్నుదెలియక । మూఢుడైమనువానికాలక్షేపమూ । నరకకూపమూ ॥ ౩ ॥ సర్వమునుబ్రహ్మంబటంచును।సంచరించనివానిమానుషజన్మమూమహీషజన్మము॥ ౪ ॥ ఆరుదాటకకన్నుగానక । అంధుడైవాదించువానిశరీరమూ।భూమిభారమూ॥౫॥ రెండునొక్కటిజేయనోపక రెండుదెరగునుండువానివికారమూ అంధకారము॥౬॥ ప్రణవనాదమువినసహించక।ప్రకృతిలోబడియున్నవాని సుగీతమూ॥దుఃఖవాత్రమూ॥౭॥చూపుచేతనురూపుమాపక।చూపుదెలియనినరునిసద్గుణజాలము । యింద్రజాలము ॥౮ ॥ సకలవేదంబులనుజదివియు శమదమాదులులేనివానిప్రయోగము । దీర్ఘరోగము ॥ ౯ ॥ నిదురలోపల నిదురదెలియక । నిత్యసంపదగోరువానివిలాసము । జ్ఞాననాశము ॥ ౧౦ మూడుసూత్రంబులనుద్రెంచక । మూడుధరియించినదురాత్మునితాళ్ళు। యండమావులు ॥ ౧౧ ॥ ప్రతినిమిషమురామమంత్రము । పఠనజేయనివానిసుందరవేషము । రవిపరివేషము ॥ ౧౨ ॥ వెల్గులోపలవెల్గుజూడక। నాల్గుగతులనునడుచువానిప్రకాశము । తమసాకాశము ॥ ౧౩ ॥ ఆదిశేషుని నిదురలేపకనతిసుషుప్తినిబొందువానిసకామమూ।భస్మహోమము ॥౧౪॥ అమృతపానముజేయనోపక । నార్యులనుదూషించువానిస్వభావము। ప్రేతభావము॥౧౫ ॥ ద్వాదశాక్షరిమార్గమెరుగక । వారకాంతకుజననమొందినపుత్రుడూ । వంధ్యాపుత్రుడూ ॥ ౧౬ ॥ పంచదశిభావంబుదెలియక । పరుగులెత్తుచుభూమితిరిగెటిపురుషుడు । స్థాణుపురుషుడు ॥ ౧౭ ॥ షోడశాక్షరితరచసేరక ।చోరుడైకనుపట్టువానినిధానము।గగననిధానము॥౧౮ వేంకటార్యునిపూజశేయక। వేరెశిలలర్చించువానిసమంత్రము।శూన్యతంత్రము ॥౧౯॥ చెంచురామకవీంద్రునికికరుణించిబోధివనివేదవేత్తలబోధలూ ॥ యమునిబాధలు ॥ ౨౦॥

శహానరాగం-ఆదితాళం.

యన్నిభోగములున్నయోగీశ్వరుడుగాడు । కన్నుగానకపాపకర్మడైయున్నవాని ॥ కెన్ని ॥౧॥ యంతబలవంతుడైన । యమునితోగెల్వలేడు।శాంతమానసమునజెందనొల్లనివాని ॥ కెన్ని ॥ ౨॥ యంతధనముగ

లిగినవెంటతీసుకపోడు । స్వాంతంబుబ్రహ్మమందుజొనిపి యుండనివాని ॥ కెంత॥ ౩ ॥ యెంతసౌందర్యమున్న । యింతినిపొందలేడు । దాంతుడైల క్ష్యార్థముధరియించకున్నవాని॥ కెన్ని॥ ౪॥ యెంతపండితుడైన । యెరు కనెరుగంగలేడుఅంతరంగమునవిభ్రాంతివిడువనివాని ॥ కెన్ని ॥ ౫ ॥ యె న్నిశిలలగన్నతన్నుగానగలేడు । కన్నులురెండుగల్పిగగనమరయనివాని ॥ కెన్ని॥ ౬ ॥ యెన్నిసుగుణములున్న । యేకత్వసిద్ధిగాదు । పన్నగేంద్రుని నిమర । భంగపరచనివాని॥ కెన్ని ॥ ౭ ॥ యేకర్మనిష్టుడైన । యోగమా యవిడువదు । ఆకాశాతీతమైనఅచలమెరుగనివాని॥ కెన్ని ॥ ౮ ॥ యేతీ ర్థయాత్రలైనవేధలుదొలగిపోవు । జాతినీతులబాసిజపముజేయనివాని ॥ కెన్ని॥ ౯ ॥ యేశాస్త్రముల్ జదివిన । యరుకమరువంగలేదు । ఆశాపా శముద్రెంచి । ఆరువిడువనివాని॥ కెన్ని ॥౧౦ ॥ యేయోగముగలిగినయం డమావులైపోవు । మాయాకాంతనుబొంది । మదముగలిగినవాని॥ కెన్ని॥ ౧౧॥ యన్నిభూషణములున్న । మన్నులోకలయుచుండు । సున్నసున్న గలిశెటిచూపుచూడనివాని॥ కెన్ని ॥ ౧౨ ॥ యంతధర్మాత్ముడైనయరదం బుడిగ్గలేడు । అంతుతెలియకచింతా । క్రాంతుడైయున్నవాని॥ కెన్ని ॥ ౧౩॥ యెందరినిగెల్చినవీర్యవంతుడుగాడు । యిందుశేఖరునేత్రమందుబు డనివాని॥ కెన్ని ॥ పంచాగ్నివేంకటార్యు । పాదారవిందములు । నెంచి పూజించుటకుయోచనలేనివాని॥ కెన్ని॥ ౧౫ ॥

సురటరాగము ఆదితాళం.

తురీయానందమునొందరా । జీవా । తురియానందము॥ జరామరణదుఃఖ రాశినెనయక । పరాపరునిగాంచిజీవా ॥ తురియా ॥ ౧ ॥అజాండకోటి నిసృజించువానిని । నిజంబుగనుమెరిగిజీవా ॥ తురియా ॥ ౨॥ మదేభముల నెసిమిదింటిగెలచియు । చిదాకాశమునమా॥జీవా॥ తురియా॥౩॥ సుధాం బురాశినిఖిలప్రకాశము । మధించుమెరిగిజీవా॥ తురియా॥ ౪॥ బిరానవేం కటగురుండుఇచ్చిన । వరంబులునుబడశిజీవా॥ తురియానంద॥

శహానారాగం-అటతాళం.

జాతిభేదములెంచి । జాతిదెలియలేకనీతిదప్పగనేలరా । జాతిభ్రా హ్మణంబైనజనుడుబాపడుగాడు । జాతియెరిగియున్నజపతపములేలను ॥ జాతి॥ ౧ ॥ జాతిధర్మములేకసర్వమువెలిగించె। జ్యోతినిదర్శించరా । జా తిమాత్రంబైనజనుడున్నపతిగాడు ।జాతులన్నియుదేనిచాతబుట్టెనుగాని ॥

జాతి॥ ౨ ॥ జాతిమెక్కువగలిగజన్మించలేదెవడు । జాతిచెప్పగనేలరా । జాతివైశ్యంబైనజనుడువైశ్యుడుగాడు । జాతులేర్పరచినచతురునియరిగితె ॥ జాతి ॥ ౩ ॥ జాతులన్నియునొక్కనాతిలో వెడలేను । జాతియేదో చూడరా । జాతిశాస్త్రంబైనజనుడుశూద్రుడుగాదు। జాతిమరచియున్న సర్వపరిపూర్ణుండు॥ జాతి ॥ ౪ ॥ జాతిమెక్కువవాడుజాతితక్కువవాడు । జాతమెప్పుడులేదురా । జాతివెంకటగురుస్వామికెదెలుసును । జాతిలేనివానిజాడదెలియరాదు॥ జాతి ॥ ౫॥

శ్రీ రాగము - రూపక తాళము.

పరమార్థములభియించుట । తరమాబహుగోప్యమిది ॥పర॥ సురమౌనిసమూహమునకు । సుధాపదమువో జీవా ॥పర॥ ౧ ॥ నిరంతరమునిరావరణమురాసుఖకరంబురా । వరతత్వముబోధించేటి । గురుదేశరమేష్టిరమా । వరగిరిజాప్రియులనుచును ॥పర॥ ౨॥ ఘనాఘనముసనాతనము। మనోగతముగాదురా । జననంబునుమరణంబును । పెనుపొందనిసాధననీమనమందుననూహించక ॥పర॥ ౩ ॥ నిరంజనమునిరామయము నిరీహమునిజంబురా । పరమేశ్వరుడగువేంకట । గురుశేఖరపాదరజంబునుసోకకవిమలంబగు॥ పరమార్థములభియించుట ॥ పరమా॥ ౪॥

కాంభోది రాగము - అట తాళం.

పదసారసరసమునుగుడిచిపా । పములనువిదళించియు । ముదమొందిచిన్మయు । పదమునొందరబోధగురు ॥ పదసా॥ మదసహితమగుగుణముసుఖకరమాజీవా। యిదిసురేంద్రముఖప్రవరులకు। విడువశక్యముగాదుగురు॥ పదసా ॥ ౧ ॥ జీవనముధనమునీకునిజమా । శోధించిచూడుము । భావించిమదినిలుపుమా । జీవాఘునభవాం । బుధిలోనమునగనేలర । భూవనాగ్నులుమొదలుగాగల । భూతములవెలిగించుగురు ॥ పదసా ॥ ౨ ॥ సారసములారిటిని దాటి । దహరాంతరాళము । చేరివైకృతినిమీటి । నారాయణపరా । పరరూపమందుదృష్టియు। ధారణామతినిల్పినిరతము ।తన్మయంబునబొందిగురు ॥పదసా ॥ ౩ ॥ నీకులముబలమువిడిచి । పంచాగ్నివేంకటశ్రీకరచరితుగాంచి । యేకాలమునొకా । నొకవేళనైననీకును। శోకమోహజరాదిదుఃఖము । సోకకుండగజేయుగురు ॥పదసా॥ ౪ ॥

తోడిరాగము ఆదితాళము.

మోహము లయిూభోగమూ । విశదముగనువినుపరమానందముగనూ

సందేహమెల్ల మానిదృఢంబుగ । సదానీవువిమలమనము జేశి । సకలమత ములనువిడచి ॥ యెందుకు ॥ ౧ ॥జీవా । జననమరణములుగలదోవా । వద లిపరమపదమునకుబోవా మనసునిలిపికనవ లెనీవా । గురుసూత్రమునీలో । దేవనదులమూడింటికినడుమను । దెలసినీవుదేవత్వమునొందర ॥ యెం॥౨॥ క్షీరాంబుధినిదరచినయమృతధారా । నుభవముగలిగియునతిఘోరా । ప దలనుదొలగుమికనుధీరా । యీనీమముదప్పక । మారుతంబుమనసొకటిగ జేశియు । మండలత్రయముకవ్వలవెలుగర ॥ యెం ॥ ౩ ॥ రామానిరత ముగురుపదములునీమా । నసకమలముననిలిపికామా । దిరిపులనణచితరణి సోమా : గ్నులదీప్తులజూచుచు । వ్యోమమార్గమును దాటినిరంజన । యో గమందుస్థైర్యంబుననిల్వర ॥యెం ॥౪ ॥ఆశాపాశములనువదలియుదేశాం। తరమునకునుకదలకగిరీశా । చ్యుతకమలజులగలపికోశాం । తరమందున వేంకట । దేశికోత్తముని తేజముజూచుచు। దేశకాలనియమంబులువిడువర॥ యెందుకుయీభోగమూ ॥ ౫ ॥

యిందుస్తానిబ్యాకురాగం - ఆదితాళం.

శ్రీవేంకటదేశికునినుతించక । చిత్సుఖపదముదొరకదురా । చావు పుటకయునుగలుగనియోగము । సాధనజేయకపొందదురా । దేవమనుజ పైశాచికమతములు । ధీప్రకాశముకుదూరమురా ॥ శ్రీ ॥ ౧ ॥ కల్లుసము ద్రముదాటకభీకర । కలుషసంఘములుదొలగవురా । పల్లవపాణీజనము లకూరిమి । బంధకంబుతైయుండునురా ॥ శ్రీ ॥ లవణసముద్రముదాటక తనదుకులాభిమానముదొలగదురా । భువనభ్రాంతియుగలిగినబుద్ధియు । బోధకుఘనమైయెప్పదురా॥ శ్రీ ॥ ౩ ॥ పెరుగుసముద్రముదాటకదుర్మ త । భేదంబులునెడబాయవురా । యరుకమరుపులనుయెరుగనిజ్ఞానము । యోగమార్గముకులోభమురా ॥ శ్రీ ॥౪ ॥ చెరుకుసారసాగరముదాటక। చిత్తశాంతియునుగలుగదురాగురుతునెరుంగని । జపములువ్రతములు గురుమంత్రమునకుభేదమురా ॥ శ్రీ ॥ ౫ ॥ నేతిసముద్రముదాటకతనలో। భూతదోషములునణగవురా । జాతిధర్మములువిడువనిమానము । జన్మదు ఖ్ఖముకుహేతువురా ॥ శ్రీ ॥ ౬ ॥ శుద్ధోదకసాగరమునుదాటక । శిద్ధు లన్నిచేకూడవురా।శిద్ధాసనుడైబూడనిలక్ష్యము । చిద్గగనంబునజేరదురా। శ్రీ ॥ ౭ ॥ క్షీరసముద్రముదాటకఘనసంసారతాపములువదలవురా। తా రకయోగముబూననిమంత్రము ।తామసవృత్తికిసాధనరా ॥ శ్రీ ॥ ౮॥ పం

చకోశములనరయనిభావను । పరమపదమునకువైరము రా। చెందురామక వినవెడియహంకృతి । చిత్తచలనముమూలము రా ॥ శ్రీవేంకటదేశికు నినుతించక । చిత్సుఖపదముదొరకదురా ॥ ౯ ॥

దేశీయముఖారిరాగం - అటతాళం.

యీభావము తెలిసితెనిప్పుడేయోగివయ్యెవురా। ఆభాసమాత్రము లైనయీభువనములన్ని మెచ్చటగల్గె రా। జీవా॥ యీభూమియుదకమునగ్ని యువాయువు నేరీతిగల్పించె రా ॥ యీ ॥౧॥ పంచవన్నెలుగలచిలుకయొ క్కటివిష్ణు। పదమునను న్నాదిరా। యదియు। పంచవిధములైన। పలుకులుబలి కితె। బ్రహ్మాండమునుబగులురా॥ యీ ॥౨॥ రాత్రియుపగలును లేనిదేశమున। రమణియొక్కతెగలదురా । అదియు నేత్రము తెరిచి తెనిఖిలలోకంబులు । సిద్ధమైపోవురా ॥ యీ ॥౩॥ యిరువదిఅయిదుజిహ్వలుగలకలహంస। విలసిల్లియున్నాదిరా। అదియుయిరువదియొక్క వేలారునూరులమార్లు। ప రుగులెత్తుచునుండురా ॥యీ ॥ ౪॥ పశ్చిమదేశమునబంగారు మేడలో । ప ణతియొక్కతిగలదురా । దాని । స్వచ్ఛమైనట్టిసంగీతమువినగానె । సకల ముశోషించురా ॥యీ॥ ౫ ॥ ఆరుపర్వతములకొక తెబిళముగలదు । య తిసూక్ష్మమైయుండురా । అమృత । ధారాప్రవాహముదానిలోపలను దు । స్తరముగప్రవహించురా ॥యీ॥ ౬॥ యిరువదినాల్గుకట్లుగల్గినట్టియు రగమొక్కటిగలదురా । అదియు । ధరణినుంచిదివికిలేచియాడితేస ప్తస్వ గములునసీయించురా ॥యీ॥ ౭ ॥ తొంబదియారుగుర్రములగట్టినరథము దొకటెసారథిగలదురా । రథము । ద్యంబుననుండేటప్రభువుదిగగానేవా । డంబరమునకేగురా ॥యీ॥ ౮ ॥ ఆకాశమునకగ్రభాగంబునను చక్ర । వా కపక్షులుండురా । రెండుయేకమైతెసర్వపరిపూర్ణమైనట్టి । పండు వెన్నెలౌనురా ॥యీ॥ ౯ ॥ దానిమ్మపూమొగ్గరసమునొక్కటిమహా । దాదులనిర్మించురా । దాని । లోనయున్నట్టి । మకరందముగ్రోలితే । రోగంబులనుమానురా॥యీ॥ ౧౦ ॥ ఆదిమధ్యాంతరహితంబైయొప్పచు న్నన్న । అమృతజలధిగలదురా । లోతు । లేదనియువడైనదిగ తేనుకామ మో । హాదులుదొలగునురా ॥యీ॥౧౧ ॥పదియారువన్నెలదేవదారిపం డు । పండినిలచున్నాదిరా । తీగెవదలిభూమిమీద । పడకుండమ్రింగిన । వానికిమృతిలేదురా ॥యీ॥ ౧౨ ॥అయిదుకన్నులుగలశిశువు। తల్లితోమా టలాడుచునున్నాడురా । జగ । న్మయుడైనపంచాగ్నివేంకటగురునికి

మర్మము దెలుసునురా॥యీభావము దెలిసితె । నిప్పుడే యోగివయ్యెపురా॥

అసావేరిరాగం. అటతాళం.

మతభేదములచేత । మరిమరివాదించి । మాయలోబడనేలరా । మతినిల్పి శ్రీ రామమంత్రంబుజపియించి । సతతము వేదాంత । సారముగన రాదా ॥మత॥ ౧ ॥ జ్ఞప్తిమరచి । విషయజ్ఞానంబుతో । దుఃఖపాప్తినొం దగనేలరా । సుప్తిలోపలనున్న । సూత్రము గురుతెరిగి । గుప్తమైయు న్నట్టి । గురినిల్పగారాద ॥మత॥ ౨॥ సంసారదుర్వారసాగరమునమునిగి । హింసనొందగనేలరా । హంసతత్వము దెలిశి అమృతంబు శేవించి । హం సారోహకుడవై యానందించగరాద ॥మత॥ ౩॥ చెక్కినశిలలకు చేతులును కుళించి । మొక్కిస్రుక్కగనేలరా । వక్కనిముఖమైనవాసుదేవుని యెం చు । నిక్కజేశిమనసునిల్పియుండగరాద ॥మత॥ ౪॥ కాంచనంబుమీద కాం క్షగలిగి । నరుల ప్రపంచనుండగనేలరా। పంచాగ్ని వేంకటపరమగురుని జేరి। చెంచురామకవివై శరణుబొందగరాద ॥మత ॥ ౫ ॥

కల్యాణిరాగం-అటతాళం.

శ్రీదేశికునిపాదశేవజేయరజీవా । వేదాంతవనమందు । విహరిం చరాజీవా ॥శ్రీ॥ ౧ ॥ కామాదివైరుల । ఖండించరాజీవా । సోమసూర్యు లనడుమ । జూచుచుండరజీవా ॥శ్రీ॥ ౨ ॥ శాంభవదృష్టినిసాధించరా । జీ వా । కుంభించిగిరిమీద । కూర్చుండరాజీవా ॥శ్రీ॥ ౩॥ చావుపుట్టుకలేని । చదువుజదవరజీవా । దేవత్వమునబొంది । తేజరిల్లరజీవా ॥ శ్రీ ॥ ౪ ॥ పశ్చిమఖిశములో । పలజేరరాజీవా ।నిశ్చలమనమునిలచియుండరజీవా॥ శ్రీ॥ ౫॥ సంసారతాపముశమియింపరాజీవా । హంసమార్గము దెలశియా నందించరజీవా ॥శ్రీ॥ ౬ ॥ నిదురజయించియు । నిజమెరుగరాజీవా । ప దిగుర్రములనడక । బంధించరాజీవా ॥ శ్రీ॥ ౭ ॥ పంచాగ్నివేంకటబ్రహ్మ నుగనుజీవా । చెంచురామకవివై శోభిల్లరజీవా ॥శ్రీ॥ ౮ ॥

దేశియంభైరవిరాగం- రూపకతాళం.

ఆదినారాయణునిజూడరా । వోజివసీలోనాదినారాయణునిజూ డరా । శోధించిచతు । ర్వేదములసారమెరుగరా । ప్రజ్ఞానమహాప్ర । సాదముభుజియించుచుండరా।సంసారబంధవి । నోదములనంటకుండరా। నిరతంబుప్రణవ । నాదమందుచిత్తముంచరా । ప్రపంచవిద్యా । వాదమె ల్లపరిహరించరా॥ తాపత్రయముల ॥ వేధలుమారంబుజేయురా । నాదబిం

దుకళలకెప్పుడు । నాథుడై మూలప్రకృతికి । నాదియై వేయుశిరములుగ
ల । నాగతలపంబునందునున్న ॥ అది ॥ ౧ ॥ చిత్తవిశ్రాంతినిబొందరా ।
సతతంబుచాలో । స్మతు నివలెసంచరించరా । కామాదిద్వైరుల । బోత్తు
విడచిగురునిజేరరా । సాధించిపునరా । వృత్తిలేని పదమునొందరా । రా
గాదిగుణముల । మొత్తములను పరిహసించిరా । యల్లప్రదుపరుల । వి
త్తమందు । వాంచమానరా । యోచించినీవు । చిత్తమందు తలపులుడు
గరా । నిగమాంతవిద్యా । వేత్తవైరాజిల్లుచుండరా । సత్తుచిత్తుయానం
దమును । సగుణనిర్గుణములుతానై । చిత్తవృత్తికిసాక్షియగుచు । శింధు
మధ్యమునందునున్న ॥ అది॥ ౨ ॥ సర్వకర్మములుత్యజించరా । నీలోనయు
న్నసర్వలోకములను జూడరా । మానంబుదాల్చి । నిర్వికల్పభావమొంద
రా । నిఖిలేంద్రియములగర్వమెల్ల ।నిగ్రహించరా । అజ్ఞానదైన్యపర్వతం
బు । గూలదన్నరా । సమాధిమొందు । సర్వదృశ్యముల మరువరా । ఆ
నందమున । నిర్విషయుడవగుచునుండరా ।అమృతంబుగ్రోలిసు । సర్వరూ
పమొందియుండరా । నిర్వికారనిరాలంబనిత్యనిర్మలనిరుపమాన । నిర్విశే
షుడవగుచు యోగనిదురతోవిలశిల్లుచున్న ॥ అది ॥ ౩ ॥ అరుదేశములను
దాటరా । యేకాంగివైపది । యారుకళల నొకటిజేయరా । సుషుమ్నబిళ
ద్వారములోతొంగచూడరా । రమణియ్యసహ । సాగ్రికమలమందుజేర
రా । శాంభవి ముద్రాధారణంబుబడశియుండరా । యిరుపార్శ్వములల
ను । బారుచున్ననదులపొందరా । సోహంబనెడు । తారక మంత్రముప
ఠించరా । విజ్ఞానఘనసం । సారసౌఖ్య మనుభవించరా । నారదాదిబ్ర
హ్మమునులు । నలినసంభవ ముఖులుగొలువ । వీరమోహిని దేవతకువిభు
డుతానైవెలుగుచున్న ॥ అది ॥ ౪ ॥ పంచభూతముల జయించరా । లో
ష్టంబుతప్త । కాంచనంబుసమముజేయరా । పరవనితలపై । వాంచలన్ని
విడచియుండరా । ననునీవుగా । భావించివాదముఖేదముమానరా ।కల్యా
ణసుగుణ । లాంఛనంబుగలిగియుండరా । లక్ష్యార్థమెరిగి । పంచకోశ
ములనుమించరా । వాచ్యార్థముని గ్ర । హించియంతర్దృష్టినిల్పరా ।
బ్రహ్మంబునీవై । పంచకోశములను జూడరా । పంచవహ్ని వేంకటగు
రుపాదపద్మయుగళముశే । వించిపంచముఖములుగల । విహగనాథునిమీ
దనున్న ॥ అది ॥ ౫ ॥ వ్యోమమార్గమందునిల్వరా । ఆమీదనుపరంధాము
డవైమెరయుచుండరా । యన్నాళ్లకైన । భూమిమండలముకురాకురా ।

నిరంతరాత్మా । రాముడవై ప్రకాశించరా । దురితాంధకారవి । రాముడవై సంతసిల్లరా । శమాదిగుణస్తోముడవై నిలచియుండరా । యోగీంద్రసార్వ । భౌముడవై యొప్పియుండరా । ఆనందజలధిసోముడవై జూచుచుండరా । సోమసూర్యలోచనుండై । నామరూపవిలక్షణుండై । ప్రేమతో వెల్లాలచెంచు । రామకవిని నేలుచున్నఆది ॥ ౬ ॥

యిందుస్తాని బ్యాకు రాగం - రూపక తాళం.

పరమాత్ముని సౌందర్యముకనరా । జీవా । యిరువదయిదింటిపైన వెలుగుచున్నది । యరుకమరపుల నెరిగిసదా వెలుగుచున్నది ॥ పర ॥ ౧ ॥ అమృతజలధియందువాల । లాడుచున్నది । అమృతపాన పరవశులకునందుచున్నది ॥ పర ॥ ౨ ॥ మేరుపర్వతాగ్రమందు మెరయుచున్నది । భూరిసహస్రారమందుపొందియున్నది ॥ పర ॥ ౩ ॥ జాగ్రదాద్యవస్థలకుసాక్షియైనది । వుగ్రకర్మలకెల్లజూడనోపరానిది ॥ ౪ ॥ యిట్టిదట్టిదనుచుగణించరానిది । మట్టుమితములేక సర్వోత్కృష్టమైనది ॥ పర ॥ ౫ ॥ పంచకోశములకుమించిప్రబలుచున్నది । పంచవహ్ని వేంకటగురుబ్రహ్మమైనది ॥ పరమాత్ముని సౌందర్యముగనరా జీవా ॥ ౬ ॥

ధన్యాసి రాగం - ఆది తాళం.

అమృతముపానముజేయనిజ్ఞానము । అజ్ఞానముగాజీవా । నమ్రభావమునగురుకృపనొందియు । అమృతనాడిరంధ్రమునస్రవించెటి ॥ అమృ ॥ ౧ ॥ చూపునుమనసునుయేకముజేయక సుఖములేదుజీవా । వ్యాపకమైపరిపూర్ణతేజమున । ఆపోజ్యోతిని వెలుగగజేశెటి ॥ అమృ ॥ ౨ ॥ ముక్తికాంతనుపొందకజీవ । న్ముక్తిలేదుజీవా । శక్తిపురుషసంయోగహితంబై । భక్తులకెల్లనుజీవనకరమగు ॥ అమృ ॥ ౩ ॥ శిద్ధుండగువేంకటగురునెరుగక । శిద్ధించదుజీవా । శుద్ధస్ఫటికాకారంబై పరిశుద్ధమగుచుక్షీరాబ్ధిలోనుండెటి ॥ అమృ ॥ ౪ ॥ పంచదశాక్షరిదెలియనివానికి । భవముబోదుజీవా । చెంచురామకవికనవరతంబునుజన్మభూమియిదియనిగుగుతెరుగుచు ॥ అమృ ॥ ౫ ॥

నాదరామక్రియ రాగం - అట తాళం.

స్వామినిజూడుముజీవా । గురుని । నీమముదప్పెలె నీకేదిదోవా ॥ స్వామినిజూడుముజీవా ॥ వ్యోమాదిపంచభూతంబులకంటక । వెలుగుచువ్యాపించియున్నాడురా । కామాంధకారంబులోజిక్కిపడియున్నకర్మయోగులువానిగనలేరురా । గురు ॥ స్వామిని ॥ ౧ ॥ యిరువదినాలుగువీథులగలి

గన । పరమపదమునందునున్నాఁడురా పరమహంసనుగూడి । ధ్యానంబు జేయని । పాపకర్ములువానికగనలేరురా ।గురు॥ స్వామిని ॥ ౨ ॥ చంద్రాంశు చంద్రమండలములనడుమను । చక్రతీర్థమునందునున్నాఁడురా । రెండు నాక్కటిజేయనేరనివారాయా పా । షండనరులువానికగనలేరురా । గురు ॥ స్వామిని ॥ ౩ ॥ గంగాయమునాసరస్వతులుగలశినచోట । బంగారుమేడ లోయున్నాఁడురా । అంగలింగనుల కర్మముల్ దెలియని ।అతిమూఢాత్మ లువానికగనలేరురా ।గురు॥ స్వామిని ॥ ౪ ॥ అండాండపిండాండబ్రహ్మాండ ములలోన । పండువెన్నెలకీలినున్నాఁడురా । కుండలీస్థానంబుభేదించనేర ని । కర్మాఠజనులువానికగనలేరురా ।గురు॥ స్వామిని ॥ ౫॥ ఆరుకొండలతు దను । వేయుశిఖరముల । మేరుపర్వతమందునున్నాఁడురా ఘోరమైనట్టి సంసారసాగరమందు । కూలేటివారుగురిగనలేరురా । గురు ॥ స్వామిని॥ ౬ ॥ అంతర్బహిర్మధ్యలక్ష్యార్థములలోన । ఆత్మారాముడుతానైయు న్నాఁడురా। శాంతశమదమాదిసద్గుణములులేని । జడులెన్నటికివానికగనలే రురా ।గురు॥ స్వామిని ॥ ౭ ॥ తత్వమస్యాదిమహావాక్యరూపమై । తారక బ్రహ్మమైయున్నాఁడురా । సత్వరజస్తమోగుణములుగెలువని । చపల చిత్తులువానికగనలేరురా । గురు॥ స్వామిని ॥ ౮ ॥ జాగ్రత్స్వప్నసుషుప్తుల కుసాక్షిభూతమై । సకలాంతర్యామియైయున్నాఁడురా । నిగ్రహించలే నియింద్రియంబులుగల । నీచనరులువానికగనలేరురా ।గురు॥ స్వామిని ॥౯ ॥ ప్రకటపరాపరప్రకృతులకంటకె । ప్రణవస్వరూపమైయున్నాఁడురా ।స కలయోనులయందుబుట్టినచ్చేటికర్మ । సాధులెల్లనుగనలేరురా ।గురు॥ స్వామిని ॥ ౧౦ ॥ సృష్టిస్థితిప్రళయవ్యాపారములకెల్ల । సూత్రధారియు తానైయున్నాఁడురా। కష్టసుఖములచేతతల్లడిల్లుచునున్న।కపటచిత్తులువా నికగనలేరురా ।గురు॥ స్వామిని ॥ ౧౧ ॥ మెరుకమరపులనెరిగిస్వచ్ఛప్రకా శమై । యెప్పుడునొకరీతినున్నాఁడురా । తిరిగితిరిగిసకలశిలలకుమ్రొక్కె టి । దీనజనులువానికగనలేరురా । గురు ॥ స్వామిని ॥ ౧౨ ॥ నిర్వికారనిరా లంబచైతన్యమై । సర్వపరిపూర్ణుడైయున్నాఁడురా । సర్వశాస్త్రకూపం బులలోనబడియున్న।గర్వాంధకులువానికగనలేరురా।గురు॥స్వామిని॥౧౩ ॥ ధరణిలోవెల్లాలచెంచురామకవికి । తల్లిదండ్రియుతానైయున్నాఁడురా।ప రకాంతలనుమరిగిసకలబాధలనొందె । గురుదూషణులువానికగనలేరురా। గురు ॥స్వామినిబూడుముజీవా । గురునిమముదప్పితేనీకేదిదోవా ॥౧౪॥

తోడిరాగము - అటతాళం.

వాదములేలా శాస్త్రపురాణ । భేదములేలా । నాదానుసంధానమోదివై నిరతము । నాదిశక్తిని నీలో నాలోకించితే చాలు ॥వాదము॥౧॥ మనసుమారుతమూ । ఒకటిగ జేశి । వినువీధిగనుమూ । ఘనమైన రాజయోగము ధరియించియు । ననిముషత్వము నొందియానందించగ రాదా ॥వాదము ॥౨॥ అంతర్ముఖుడవై జూచుచు పరమ । శాంతసుమతివై । చింతలన్నియు విడచి । చిత్కళామయమైన । కాంతిలో నిలచి । యేకాంత మొందితే చాలు ॥ వాదము ॥ ౩ ॥ పంచాక్షరములూ । గురు తెలిసి సేవించితే మేలూ । పంచాగ్ని వేంకటపరమగురునాధుని । గాంచి భావించి పూజించియుండిన జాలు వాదములేలా । శాస్త్రపురాణభేదములేలా ॥ ౪॥

ముఖారిరాగం - అటతాళం.

సత్తామాత్రముగోప్యమూ । సాధించి నీవు శోధింపుమూ । జీవా । ప్రవృత్తిని బుట్టించి ప్రబలింపజేసిన । పరమేశుడుండగనూ । వృత్తిచేతను వస్త్రదానమిచ్చితిననే । వూహ నీకెందుకురా ॥ సత్తామా ॥ ౧ ॥ ద్రవ్యమూలంబైన । పైడి నేర్పరిచిన దైవమొకడుండగనూ । జీవా । ద్రవ్యదానమునిచ్చే దాతను నేననే । దర్పము నీకేలరా ॥సత్తామా॥౨॥ ధాన్యము గల్పించి । ధరణిపై బెంచేటి ధన్యాత్ముడుండగనూ । జీవా । మాన్యుడవై అన్నదానమిచ్చితిననే । మదము నీకెందుకురా । సత్తామా ॥ ౩ ॥ మహిని నేర్పరచి యీజగములనిచ్చిన । మాధవుండుడగనూ । జీవా । గృహము దానము జేశే ధీరుని నేననే । అహము నీకెందుకురా ॥ సత్తామా ॥ ౪ ॥ పంచాగ్ని వేంకటనారసింహగురుడు । బ్రహ్మమైయుండగనూ । యీప్ర । పంచమెల్ల తిరిగితిరిగి శిలలకు మ్రొక్కే దీనత్వమెందుకురా ॥ సత్తామా ॥ ౫ ॥

అసావేరిరాగం - అటతాళం.

యీమాయావాదులకు । పరమసౌఖ్యము లేదు । యెన్నాళ్ళకును జీవా । కామక్రోధంబులు । వర్జించివామని । కన్నులు మూయుచు పలుకకుండుటే కాని ॥ యీ ॥ ౧ ॥ తనువు ధనము శాశ్వతము గాదంచును పరుల । కనువుగ బోధింపుచూ । అనుదినము సుకొందరితరధనంబులు । అపహరింపుచు చపలచిత్తులై యున్నారు ॥ యీ ॥౨॥ ఇలలో వేశ్యాస్త్రీసంగము దోషమటంచు నితరులకును దెల్పుచూ । యిలరంగ కొందరు యజ్ఞకర్మల్ జేశి । యమర వేశ్యలబొంది హతమై పోచున్నారు ॥ యీ ॥ ౩ ॥ విష

యభోగంబులనిత్యములనిశాస్త్రవిధులెల్లదెల్పుచునూ। విషయతృష్ణలచేత వేధనొందుచుకొంద । రేపాత్రిదినతిదుఃఖమున బొందుచున్నారు ॥ యీ ॥ ॥ ४ ॥పంచాక్షరీమంత్ర పారాయణుల మనిషరులకుపదేశింపుచూ । పంచాగ్ని వేంకటగురుని గానగలేక । పాపాత్ములై కొందరవనిలో యున్నారు ॥ యీ ॥ ౫ ॥

జంఝూటిరాగం - అటతాళం.

యిదిగోరగురుకీలకమూ । జీవా । పదిలముగానుభజించుసంతతమూ । చెదరనికైవల్యపదమూ । నీదు । హృదయముపవనమొక్కటిగా జేయుమూ ॥ యిది ॥ ౧ ॥ మెనిమిదిపొరలు గలిగుండూ । పండు । విను వీధిలోశుభ్రిముగపండియుండూ । మునులకైనను అందకుండూ । సద్గు । రునిచేతనదియు లభింపబడుచుండూ ॥ యిది ॥ ౨ ॥ కుండలిస్థానంబునందూ । యీబ్ర । హ్మాండజాలములెల్ల గలిగిలయమొందూ । పండువెన్నెలగాయుచుండూ । నీవామండలమందున వీక్షింపుమండూ ॥ యిది ॥ ౩ ॥ ఆరుచక్రముల మార్గంబూ । దాటి । మేరు చక్రమునందు జేయుతపంబూ । తారక యోగాంజనంబూ । వేశి । దూరదృష్టిచేతజూడునిరతంబూ ॥ యిది ॥ ४ ॥ యేడులోకంబులుదాటూ । నీవూ । మూడుకొండల తాల్మిచేతనుమీటూ । మూడురహితమైనచోటూ । జీవా । కీడులేనితావు । యదినీకుసేటూ ॥ యిది ॥ ౫ ॥ పశ్చిమద్వారమై భవమూ । నీకు । నిశ్చలమార్గము । జ్ఞానానుభవమూ । సచ్చిదానందలక్షణమూ । అదె । నిశ్చయమనుకుంటె । నీకేమిభయమూ ॥ యిది ॥ ౬ ॥ నిదురజాలించుసంతతమూ । నీవూ । నిదురలోపలనున్న । నిజమునగనుగొనుమూ । హృదయాకాశములోజూడుమూ । నీవుపదినాదములనుశూన్యంబుజేయుమూ ॥ యిది ॥ ౭ ॥ పరమసుషుమ్నాదేశమూ । నీకు । నిరుపమబోధసుఖోపవేశమూ । తరణికోటిప్రకాశమూ । నిత్య । నిరతిశయంబైనచిద్విలాసమూ ॥ యిది ॥ ౮ ॥ పంచకోశవ్యతిరిక్తంబూ । నిష్ప్రపంచనిరంజననిర్వికారంబూ । చెంచురామ కవిసౌఖ్యంబూ । చూడు । పంచాగ్ని వేంకట గురునిరూపంబూ ॥ యిది ॥ ౯ ॥

హిందూస్థానిబ్యాకురాగము - రూపకతాళం.

యింతమాత్రభోగమునకుయేలరయీమోహమూ । సంతతంబుగాదుయీసంసారమునింద్రజాలమూ । చింతలనెడుగహనమందు। చిక్కు-

టకుమూలమూ ॥ యింత ॥ ౧ ॥ రాతిబొమ్మకుబూజజేశితె । నీతులేమై నపల్కునా । నూతిలోనమునిగితేతన। రోతవిడిచిపోవునా । కోతిచేష్టలు జేసితుదకుమాలిపోవుటనిజమురా ॥ యింత ॥ ౨ ॥ వూపిరిబిగబట్టితేతన। పాపమెల్లనుబోవునా । పాపపుణ్యకర్మములు । ప్రతిఫలించక పోవునా । చూపురూపును దెలియలేక స్రుక్కిపోవుటనిజమురా ॥ యింత ॥ ౩ ॥ కన్నుమూశిపలుకకున్నకారణంబునెరుగునా । కన్నయోనులందుబుట్టి । కష్టపడకపోవునా । యెన్నిసాధనులున్న తుదకు । వ్యర్థమయ్యేపోవురా ॥ యింత ॥ ౪ ॥ వేంకటగురుభజనలేని వేదమార్గములేలరా । శంకరజీవైక్యపదవి । జెంది సుఖమునొందునా । యింకనైన నిజముదెలసి । శంఖలన్నియుమానరా ॥ యింత ॥ ౫ ॥

శహానరాగం - ఆదితాళం.

మాటిమాటికివృథా । మాటలేలరజీవా । మాటమరచినవాడె । మనకుసద్గురుడౌరా ॥ మా ॥ ౧ ॥ మాటలే వేదములు । మాటలే మంత్రములు । మాటలాడేటివానిమర్మముదెలియవలెరా ॥ మా ॥ ౨ ॥ మాటలేధర్మములు । మాటలేకర్మములు । మాటయేదిక్కునుండి మనకువినుపించురా ॥ మా ॥ ౩ ॥ మాటలేజపములు । మాటలే తపములు । మాటలేనిచోటనుమనమునివసించవలెరా ॥ మా ॥ ౪ । మాటలేయజ్ఞములు । మాటలేయోగములు । మాటలేని జపంబు । మనము జేయంగవలెరా ॥ మా ॥ ౫ ॥ మాటలేసుఖములు । మాటలే దుఃఖములు । మాట వేంకటగురునిమహిమని తెలియవలెరా ॥ మా ॥ ౬ ॥

పూర్ణషడ్జమరాగం - ఆదితాళం.

శాంతమేతపమనియరుగరా । సకలయోగిగణముకు ॥ శాంత॥౧॥ అంతుదెలియనిప్రకృతినిదగిలియునీవూ। చింతశేయలేవు ॥ శాంత ॥ ౧ ॥ మౌనమే జపమని తెలియరా । జ్ఞానయోగమందు । మౌనమే జపమని తెలియరా । ధ్యాన ధారణాయోగములన్నియునీవూ । పూనియుండలేవు ॥ శాంత ॥ ౨ ॥ బోధమే సుఖమని యెంచరా । సాధుజనులకెల్ల । బోధమేసుఖమనియెంచరా । బాధకరములగువ్రతములయందుననీవూ । వేధనొందలేవుశాంత ॥ ౩ ॥ వాంఛలన్నివిడచియుండరా । వారిజాక్షులందు। వాంఛలన్నివిడచియుండరా । పంచవహ్నివేంకటగురు పదములునీవూ । గాంచికొల్వవలయూ ॥ శాంత ॥ ౪ ॥

నీలాంబరిరాగం - ఆదితాళం.

పరమానందపదవీ । గనుగొనరా పరమానందపదవీ । గురుపదా బ్జములమకరందము శేవించి । తరణిచంద్రమండలములునీలోగాంచి । నిరుపమానశౌషుమ్న మార్గమున । నిలచినీవులక్ష్యార్థ మగని ॥ పరమా ॥౧॥ సోహమనెడుమంత్రానుష్ఠానము జేశి । సుఖమును దుఃఖము । సమమని మదిదలపోసి । దేహధర్మగుణరాశినిదగులక । ధీవిలాస సాక్షిత్వమునీవై ॥ పరమానంద ॥ ౨ ॥ సోమసూర్యరంధ్రంబుల రెంటనిగలిపి । వ్యోమకేశు నేత్రంబునదృష్టిని నిలిపి । భూమిజలము మొదలైనభూతముల । పురములైదిటని దాటియు ఘన ॥ పరమా ॥ ౩ ॥ పంచగగనముల దహరమునసుసమయించీ । ప్రణవనాదమును మనమునననుసంధించి । పంచశక్తులను పదిలపరచుకుని । చెంచురామకవివరుననిమురియకనా । నందపదవి ॥ ౪॥ పంచవహ్నివేంకటగురు పదములునమ్మి । ప్రకృతిగుణములను బాయగనెగరగజిమ్మి ।పంచదశిని వెడబాయకదలచుచు । కాంచనాద్రిశిఖరంబుననిలచి సదానందపదవి । గనుగొనరా ॥ పరమా ॥ ౫ ॥

భైరవిరాగం - రూపకతాళం.

వేంకటదేశికునిజూడరా । విశదముగ జీవా ॥వేం॥ శంకరబ్రహ్మేంద్రసూర్యచంద్రదహన తేజములను । పొంకముగను వెలుగజేశి । పూర్ణుడైవ్యాపించి రాజిల్లుచున్నట్టి ॥ వేం ॥ ౧ ॥ ఆరుశక్తులను జయించరా । నిగమాంతవిద్యా । సారమెల్లనుభుజియించరా । ఆరు వేసములనువిడచి । అయిదు హారులగట్టివేసి । ధారణాయోగంబుచేత । దహరాకాశంబున తపమాచరింపుచు ॥ వేం ॥ ౨ ॥ పంచపక్షుల నడకనిల్పరా । ద్విదళాబ్జమును భేదించిసుషుమ్నబిలముదూరరా । పాంచజన్యశంఖమునుపూరించి పరమభక్తుడైన । చెంచురామకవినివిమల । శాంతమూర్తిని జేయదలచికరుణించిన ॥ వేం ॥ ౩ ॥

ముఖారిరాగం - అటతాళం.

యేమివిననివారిధన్యులుభువిలోన । యోచించిమరిజూడరా । కామముతోహరిశ్చంద్రమహరాజు । కథలెల్లవినినరులూ । యేమాత్రమైనను సత్యముల్ బలుకక । యెపుడుమిథ్యావాదులైపోయినారు ॥యే॥ ౧ ॥ కడుధర్మచరితుడౌ పాండుభూపతిసుతుని । కథలన్నివినినరులూ । పుడమిలోధర్మమొక్కటియైన జరపక । జడులైయధర్మములెసలుపుచును

న్నారు ॥ యే ॥ ౨ ॥ బలికర్ణశిబ్యాదిపరమదాతలకథలు । బరువడివినిజ
నులూ । కలిగినమాత్రమునతిథిజనులకైన । కాసైననివ్వకనీచులైపోయినారు
యే॥ ౩ ॥ ఘనుడగుసారంగధరమహీపతియొక్క । కథలెల్లవినినరులూ ।
అనవరతముపరస్త్రీలనురమియించి । అతికాములైధనమునార్జించుచున్నా
రు ।యే॥౪॥ పంచాగ్ని వేంకటనరశింహదేశికుని ।ప్రజ్ఞలువినినరులూ ।పం
చాక్షరీమంత్రపఠనమైనాగాని ।వాంచించనేరకచెడిపోవుచున్నారు ॥యే
మీవిననివారేధన్యులుభువిలోనయోచించిమరిచూడరా॥౫॥

జంఝూటిరాగం-అటతాళం.

సంపూర్ణజ్ఞానలేశంబుతో సరియౌనా ।శతకోటిధనరాశివో జీవా
పెంపుజేశిధనముకూడబెట్టితుదకు । పేరైనలేకుండువో జీవా ॥సం ॥౧ ॥
వైరాగ్యసౌఖ్యలేశంబుతో సమమౌనె । వనితలభోగమువో జీవా । ధారు
ణిలోయజ్ఞకర్మలుచేశితె । ధరలోమరలజన్మింతురుజీవా ॥సం॥ ౨ ॥ లలిత
గురునిభక్తిలవముతో సరియౌనె ।తలిదండ్రికరుణలువో జీవా । చలచిత్తము
నుగలిగియులసౌఖ్యములచేత । చెడిపోవుచున్నారువో జీవా ॥సం॥ ౩॥ వేం
కటగురువత్స్యశిష్యునిబోలునే । విప్రులేంద్రవర్యుడువో జీవా । సంకరమత
ములనమ్మియుండితుదకు । సార్వకాలముదుఃఖపడియేరురా ॥సం ॥ ౪ ॥

శహనరాగం - ఆదితాళం.

గురుభక్తిగలిగినట్టి। గుణవంతునికంటెను । సరిజూడనేపుణ్యాత్ము
సామ్యమెందైనలేదు ॥ గురు ॥ ౧ ॥ శ్రీరాజయోగాబ్ధిచెంద్రుడైనయోగి
కి । నేరాజరాజుసామ్యమెందైనలేదుజీవా ॥ గురు ॥ ౨ ॥ పాపపుణ్య వి
చారపరుడైనబుధునకు । నేపండితుని సామ్యమెందైనలేదుజీవా ॥ గురు ॥
౩ ॥ వాశికెక్కినసత్యవాక్యసంపన్నునకు । నేసంపన్నునిసామ్యమెందైన
లేదుజీవా ॥ గురు॥ ౪॥పంచాగ్ని వేంకటబ్రహ్మయ్యమూర్తికన్న।మించినదై
వము । మేదినిలోనలేదు ॥ గురు ॥ ౫ ॥

యిందుస్థానిజంఝూటిరాగం-అటతాళం.

గురుమంత్రమూ దెలియావలెరా । గురుపాదతీర్థముగో ్రలంగవలె
రా॥గురు॥పరమజ్ఞానముగలిగే।పర్యంతమునిత్య । నిరతిశయంబైనాబోధ
గావలెరా॥గురు॥౧॥ నాల్గుసాధనములు।నయముగసాధించి।వెలుగునచీక
టినెరుగంగవలెరా॥గురు॥౨॥వైరాగ్యోపరతులవనరుగబొందియు।వైరుల
నాగ్గురిపధియించవలెరా ॥గురు ॥ ౩ ॥ మృత్యువునొందక । మూడుకాల

ములందు । నిత్యుడైయుండేటి । నీతిగనవలెరా॥గురు॥ ౪ ॥ అజునుబ్రహ్మ నారాయణాదిమూర్తులనెల్ల ।సృజనజేశినవానిజూడంగవలెరా ॥గురు॥ ౫ ॥ఆకాశవాయువులగ్నిజలభూములు । యేకాంతముననీలో వెదుకంగవలెరా॥గురు॥ ౬ ॥ సృష్టికిపూర్వముసూర్యచంద్రాగ్నులే । నిష్టతోనుండెనోనెరుగంగవలెరా॥గురు॥ ౭ ॥మింటచిత్తర్వులుమెరయగ వాగ్నియు। వెంటనెతుడిచేటి।విభునిగనవలెరా॥గురు॥౮ ॥ పంచాగ్నికులదుగ్ధపారావారమునందు। మించ్పినచంద్రునిగాంచంగవలెరా ॥ గురుమంత్రమూజెలియవలెరా ॥ ౯॥

నాదరామక్రియరాగం-అటతాళం

యీమాయనిజమొకల్లానా। గురు । స్వామీయీమాయాయెందుండివొచ్చెనో ॥యీ॥ భూమిలోపలసకలస్త్రీపురుషరూపముల ।బుట్టింపనొకడంటినిది గాకమరియీభూమిభారముదాల్చిపోషింపనొకడంట । తామసంబునసురలజంపనొకడంటా ॥యీ॥ ౧ ॥ కర్మజీవులనెల్లకాలపాశముచేత । గట్టిమెవడోనొకడుగొనిపోవునంటా । ధర్మమెల్లనుజెలసిజీవకోటినిబట్టి । దండనజేశెటివాడొక్కడంటా ॥ యీ ॥ ౨ ॥పరమాత్ముడొకడంటజీవాత్ముడొకడంట । పరమపదమువేరేయున్నదంటా । పరమాత్మనెరిగినజీవునిమూతలు । పరమపదమునకుగొనిపోగురంటా ॥ యీ ॥ ౩ ॥కర్మజేశితెగానికడతేరలేరంట । కర్మనిష్టుండైనజీవుడొకడంటా । కర్మభ్రష్టుండైతెనరకమునపడునంట ।కర్మకాండయువిడువపనికిరాదంటా ॥యీ॥ ౪ ॥ తానుప్రాణముయిచ్చిప్రపచారములుజేశి । ధ్యానించితెశిలలుఫలమిచ్చునంటా। తానుబ్రహ్మయజ్ఞపారాయణుండంట । తనుస్వర్గలోకంబునకుజేరునంటా ॥ యీ॥ ౫ ॥ మరికాశీగంగలోస్నానమొనరించితె । దురితములెల్ల దొలగిపరిశుద్ధుడగునంటా । ధరణిలో యితరతీర్థములన్నియిటువంటి । పరిశుద్ధమైనట్టిజలములుగాదంటా ॥యీ॥ ౬ ॥ పితురుదేవతలతానర్పించుకుంటెను పితురుదేవతలధోగతికిజనునంటా । శ్రుతులుశాస్త్రంబులు । చదువనివానికి । సుజ్ఞానమెన్నాళ్ళకునుగల్గదంటా ॥యీ ॥ ౭ ॥ తనవంశాచారంబుతనుతప్పరాదంట ।తనతండ్రివలెతానునడవవలెనంటా। తనుబ్రాహ్మణోత్తముడంటశూద్రాన్నంబు । తనుభుజించినపిదపశూద్రుడగునంటా ॥యీ॥ ౮ ॥ సుతులుగలుగకున్న సుఖగతులులేవంట । సతినష్టమైతెనపత్నీకుడంటా । సతులులేకుండిన పూజ్యుండుగాడంట । సుతులవలనతనకుసుఖముమరునంటా॥యీ॥౯॥ పుట్టినప్పుడుగోత్రజులకెల్లపురుడం

ట । గిట్టినప్పుడుమరలసూతకమంటా । పుట్టినచ్చోటివాడు యెవడో జెప్పుమ
టన్న । మట్టుయెవ్వరికిదెలియ లేదంటా ॥ యీ ॥ ౧౦ ॥ ముట్టుముట్టుకు
స్త్రీలముట్టుకోరాదంట । ముట్టుబ్రహ్మహత్యపాతకమంటా । ముట్టైన
నాల్గుదివసంబులుజరిగితె । ముట్టుశరీరంబులోన లేదంటా ॥ యీ ॥ ౧౧ ॥
ముట్టైననాల్గుదివసంబులుజరిగితె । ముట్టకుంటే పతికి బహుదోషమంటా ।
ముట్టు యేవాస్తువో నేత్రావునుండునో । గుట్టుజెప్పుమన్నది తెలియదంటా
॥ యీ ॥ ౧౨ ॥ పంచాగ్ని వేంకటనరహరిగురు పాద । పద్మయుగంబు శే
వించరాదంటా । చెంచు రామకవియనె నామ మొకటంట । జగములన్ని
యునిత్యమైనిల్చునంటా ॥ యీ ॥ ౧౩ ॥

ముఖారి రాగం-అట తాళం.

బ్రహ్మజాతిగలచిన్నది । ప్రణవబ్రహ్మమందిరముననున్నది । బ్ర
హ్మరుషులకైనపట్టుబడకున్నది । బ్రహ్మేంద్రాదులకెల్ల పరమార్థమై
నది ॥ బ్రం ॥ ౧ ॥ నామరూపంబులు లేనిది । సర్వకామాతురులకుదూరమైన
ది । భూమినిజలమును । వ్యోమవాయువులను । సోమసూర్యాగ్నులసాక్షిక
యున్నది ॥ బ్రం ॥ ౨ ॥ మాయతోపొందెపుడు లేనిదీ । దానిమాయయవరికి
దెలియకున్నది । యేయుపాధులు లేక వెలుగుచునున్నది । కాయేంద్రియ
ప్రాణగణములు లేనిది ॥ బ్రం ॥ ౩ ॥ అతిసూక్ష్మమై దెలియకున్నది । చిన్మయా
నందరూపమైయున్నది । మతభేదములచేత । మనసుకురానిది । అతులిత
తేజమైయద్భుతమైనది ॥ బ్రం ॥ ౪ ॥ యరుకమరవులమించియున్నది । దా
నినేరిగెటియుక్తిలేకున్నది । పరమజ్ఞానులకైనభావించడానకు । తరముగా
నిదిలోకధర్మముగానిది ॥ బ్రం ॥ ౫ ॥ నాదబిందుకళలు లేనిది । తర్కవాదంబు
లకు తెలియరానిది । ఖేదమోదంబులు వేధలు లేనిది । పాదుయెన్నడు లేక
భాశిల్లుచున్నది ॥ బ్రం ॥ ౬ ॥ యేకమై పరిపూర్ణమైనది । దానికేసామ్యమును
చెప్పరానిది । సాకారరహితమైసత్యమైశుద్ధమై । ఆకాశాతీతమైఅచ
లమైయున్నది ॥ బ్రం ॥ ౭ ॥ సృష్టికిపూర్వమునున్నది । మరలసృష్టిబోయి
నవెనుకనున్నది । సృష్టికాలమందుస్వప్రకాశముతోడ । వ్యష్టిసమష్టినియె
నయకనున్నది ॥ బ్రం ॥ ౮ ॥ పంచభూతంబులుగానిది । సర్వబ్రహ్మాం
డములుతానైయున్నది । పంచాగ్ని వేంకటపరమదేశికుని । గాంచితెబ
యలుగగనుపించుచున్నది ॥ బ్రం ॥ ౯ ॥ పంచకోశంబులు లేనిది । నిష్ప్రపంచ

మైనిరవేద్యమైనది । చెంచురామకవిజేశినదుష్కర్మ । సంచితంబులనెల్ల
శమియింపుచున్నది ॥ బ్ర ॥ ౧౦ ॥

సురటరాగం- అటతాళం.

పరమేశ్వరునినీలోగనరా పరమపదముజేరరా । వోజీవా॥ పర॥ధ
రణీమొదలైనభూతంబులైదింటిని । దాటేమార్గముజూడరా। చిత్పురమం
దు । పరమహంసనుగూడరా । మాయనురోశి । యిరువదైదింటికినిసాక్షి
గ। వెలుగుచునుకాలత్రయంబున । నిరతిశయవైభవముగలిగివినిర్మలుండై
నిలచియున్న ॥పర॥ ౧ ॥ ఐహికాముష్మికభోగములయందు । నాశలుని
జించరా । తాపత్రయదాహముశమియించరా । నిరతంబుహం|సోహ
మనుమంత్రార్థముసుపరి । శోధనంబునుజేశివిమల । విదేహకైవల్యామృ
తంబును । దిటవుగాపానంబుజేయుచు ॥పర॥ ౨ ॥ అండాండపిండాండబ్ర
హ్మాండములునిలచి । యుండెసూత్రముగానరా । దహరాకాశ ।మండల
మునగలయరా । యల్లప్పటికి । కుండలిస్థానంబునందున । కోటిసూర్యప్ర
భలతోడను । నిండిసప్తావరణములలో । నిశ్చలంబుగవెలుగుచుండెటి॥పర॥
౩ ॥ పంచాగ్నులవేంకటార్యస్వరూపమై । పంచకోశాతీతమై।యాసమా
నంబై । పరమబ్రహ్మానందమై । నిరవేద్యమై । చెంచురామకవిప్రసన్న
విశేషచిత్సుఖరూపకంబై । పంచదశిమంత్రానుభవమును। భావమందున
పొందజేశెటి ॥ పరమేశ్వరునినీలోగనరా । పరమపదమునజేరరా ॥౪॥

ఆనందభైరవిరాగం- ఆదితాళం.

పరిపూర్ణానందసుఖముపొందరా।జీవా। పరమగురునిబోధనొందరా ।స
ర్వ।దురితకర్మంబులన్నిమానరా।నిత్య। నిరతిశయసమాధిబూనరా ।జీవా।
పరకాంతలపైమమతవీడరా।మహా ।పరమశాంతత్వమునగూడరా ।జీవా।
గురుమంత్రపారాయణముజేయరా । ప్రకృతిపురుషులకనులురెండుమూ
యరా।నిత్య।నిరుపమరాజయోగనియతిదప్పక సర్వ॥పరి॥౧॥కామాదివైరుల
నుద్రుంచరా।నీలో।ధీమానసములవృత్తులణచరా। మోక్షకాముండవగుచు
ప్రకాశించరా।ఆత్మారాముండవగుచుచరియించరా । పరంధాముండవగు
చుసంతసించరా।రామనామముమదిలోనెప్డునుంచరా ।సకల।సీమమ్ముల
నుపరిహరించరా।బుధసు। త్రాముండవగుచుసంచరించరా।రూప।నామగు
ణధర్మములునాకులేవనిసర్వ॥పరి॥౨॥ చూపుమనసునొకటిజేయరా ॥సర్వ॥
రూపవిలాసములుమాయరా । కంటి। పాపలోపలదృష్టినిల్పరా।సర్వ।వ్యా

పకమైనతపముసల్పరా । నీవు । ఆపోజ్యోతిని యువలోకించరా । మూడుశా పురంబులు దొలగించరా । గురుని । శ్రీపాదములకుపూజశేయరా । రెండు దీపమ్ములనువకటిజేయరా । జీవా । తాపత్రయములచేదగిలివతిలించకను ॥ పరి॥ ౩॥ మండలత్రయమును దాటరా । అండపిండబ్రంహ్మాండములమీటరా । నీవుపందువెన్నెలబయలు గాంచరా । వూర్ధ్వ । కుండలిశక్తిని భేదించరా । గగన । మండలముననైననిల్వరా । ఘనవే । దండతండమ్ములను గెల్వరా । కోటి । చంద్రాంశుభాసురంబుచూడరా । నీలోనుండేటిమాయావతినివీడ రా । నీవుపెండుసమాధిలోననిదురదెలశినర్వ ॥ పరి॥ ౪ ॥ ఆరుదేశంబులు శోధించరా । ఘనసం । సారవృక్షమూలముగాంచరా । సహస్రారచక్రము నుసందర్శించరా । మహామేరుపర్వతబిళముగూరరా । సర్వాధారపీ ఠంబుపైనజేరరా । నిర్వికారుండవగుచునిలచియుండరా । వేదసారార్ధజ్ఞానమునపొందరా । పదియారుకళలకుపైనబుంచరా । మహాధీరుండవై సోషుప్తదేశమందుననర్వ ॥ పరి॥ ౫ ॥ అస్తంగతాశుండవైయుండరా । నీకు । స్వస్తాతమేదొదెలశియుండగా । బ్రహ్మాపాస్తిచేరావిల్లుచునుండరా । నీవుఅస్తోకవైరాగ్యముబూనరా । యీసమస్తభోగములన్నిమానరా చిదచిద్వస్తుతత్వజ్ఞానివైయుండరా । సుప్రశస్తమహిమగలిగియుండరా । నీవునిస్తుత్యభావమెల్లమానరా । సర్వావస్థాతీతమైనట్టివసతి గురుతె రిగిసర్వ ॥ పరి॥ ౬ ॥ పంచకోశములగతిని గానరా । నిష్ప్రపంచజ్ఞానమెప్పుడూబూనరా । నీలో । పంచభూతంబులబంధించరా । విలసత్పంచాకాశములపైన గాంచరా । జీవా పంచతన్మాత్రలకుమించరా । సముదంచితయోగమువధరించరా । మోక్షలాంఛనంబులుగలిగియుండరా । నీవుపంచాగ్నివేంకటగురునిజూడరా । జీవా । చెంచురామదాసునిశాంతచిత్తునిజేశి॥ పరిపూర్ణానందసుఖముపొందరాజీవా ॥ ౭ ॥

కల్యాణిరాగం - అటతాళం.

కాశీజలంబులుమూడేశిమారులు । మోశితెఫలమేమిరా । దేశికస్వామికిదండ్డమర్పించిపార్థించివిజ్ఞానముదోచదేమిరజీవా ॥ కాశి ॥ ౧ ॥ పదుగురితోగూడివుపవాసములచేతనొదిగితెఫలమేమిరా । మదిలోసంకల్పముమానిప్రణవనాదమాలకించనుమదినిదోచదేమిరజీవా॥ కాశి ॥ ౨ ॥ డంభాచారముచేతసర్వకార్యములుపార్రంభించఫలమేమిరా । శాంభవీదృష్టిచేసకలకలుషంబుల । సమయింపగనుమనసుదోచదేమిరజీవా ॥ కాశి ॥

౩ ॥ నిద్రావస్థనుబొందిసర్వకాలములందు । నెగడంగఫలమేమిరా । చిద్విలాపమునుతనలోబూచితన్మయుంబు । జందిసుఖించననదోచదేమిరజీవా ॥ కాశీ ॥ ౪ ॥ మోసమెఱుగకసకలదేశశిలలకెల్ల । మ్రొక్కితేఫలమేమిరా ।దేశికంటిచేతకుండలీస్థానము । భేదించుటకుమనసు దోచదేమిరజీవా ॥ కాశీ ॥ ౫ ॥ పొట్టకూటివిద్యలెల్లనేర్చియుపరుల । భూషించ ఫలమేమిరా । మట్టులేనిమోహపాశంబులను దెంచే । గుట్టునీమనమున దోచ దేమిరజీవా ॥ కాశీ ॥ ౬ ॥ కట్టుదిట్టములేకనితరులనొగ్గ్వక । దట్టుటఫలమేమిరా । దిట్టమైననిర్వికల్పసమాధిని । బట్టుటకునుమనసుదోచదేమిరజీవా ॥ కాశీ ॥ ౭ ॥ సామ్రాజ్యపదవితోసకలశాస్త్రంబులు । చదువంగఫలమేమిరా । అమృతనాదమునను సంధానంబుజేయుచు । అమృతపానము జేయనోపవేమిరజీవా॥ కాశీ॥౮॥ భవరోగములచేతపొరలిపొరలికష్టపడుటయుఫలమేమిరా । శివయోగమైన(శ్రీ) । వేంకటదేశికుని। శేవించుటకు మనసుదోచదేమిరజీవా ॥ కాశీ ॥ ౯ ॥ధరణిలోనెల్లెంచెంచురామదాసుడనిచెప్పఫలమేమిరా । యరుకమరపుల నెరిగేయరుకనేనేనని । యరుగుటకుమనసుదోచదేమిరజీవా ॥ కాశీ ॥ ౧౦ ॥

అసావేరిరాగం - అటతాళం.

విజ్ఞానరాజయోగముదారిగనిచిత్త । విశ్రాంతిసిబొందరా । యజ్ఞదానతపములెన్నిజేసినగాని । ప్రజ్ఞానలక్ష్యానుభవముతో సరిగావు ॥ విజ్ఞా ॥ ౧ ॥ సోహమనే మంత్రజపమహాత్మ్యమునెరిగి । సౌఖ్యమనుభవించరా । ఆహారనిద్రలునణగినవ్రతమైన । దేహాభిమానరహితునితోటి సరిగాదు ॥ విజ్ఞా ॥ ౨ ॥ అమృతనాదమునీలో చపలమంతయువిడచి । యాలకించుచునుండరా । సామ్రాజ్యభోగము నొందియుండినగాని । అమృతానుభవముకునదియునుసరిగాదు ॥ విజ్ఞా ॥ ౩ ॥ పంచాగ్ని వేంకటబ్రహ్మాఖ్యమూర్తిని । గాంచిపరిపూజించరా । కాంచన గిరులెన్నికలిగియుండినగాని । పంచదశాక్షరీబలముతో సరిగావు ॥ విజ్ఞా ॥ ౪॥

తోడిపున్నాగరాగం - యేకతాళం.

భోగమేభోగమురా । భూమిలోవాని । భోగమే ॥ రాగద్వేషములను । రహితముజేశిభవ । రోగములనుబాశియోగమైయున్నవాని ॥ భోగ ॥ ౧ ॥ గుణముల మూడింటి । గూడకధీరుడై । ప్రణవనాదామృతరసముగ్రోలినవానిభోగ॥ ౨॥ మూడుపదులలోనమణిగిపరిశుద్ధుడై । గా

ఘాంధకారమును । గడచినిలచినవాని ॥ భో॥ ౩ ॥ శక్తిత్రయాతీతసా ధనచిత్తుడై । ముక్తికాంతను జేరి ముద్దుబెట్టినవాని ॥ భో॥ ౪ ॥ రాజ యోగమనే పారావరమందున । రాజహంసయువలెను । రంజిల్లుచున్న వాని॥భో॥ ౫ ॥ శాంతమనస్కుడై సమరసభావమున। అంతర్లక్ష్యము లోనానందించినవాని ॥ భో॥ ౬ ॥ ఆరుకొండల బిళముదూరిపైనున్న మహం । మేరుపర్వతమందు చేరిసుఖించువాని ॥ భో॥ ౭ ॥ మనసుమా రుతముల । మూర్గ మొకటిగ జేశి । మనసునిర్గుణబ్రహ్మమందు జేర్చినవాని ॥ భో॥ ౮ ॥ పంచాగ్ని వేంకటపరమగురుని జేరి ।పంచదశాక్షరీ । పఠన జేసినవాని ॥ భో॥ ౯ ॥ పంచభూతంబుల । పాదులుగురు తెరెంగ । చెంచురామకవికేశ్వద్ధినొసగినవాని ॥ భో॥ ౧౦ ॥

సురట రాగం - అటతాళం.

గురుసేగనవే । వోమనసాగురు పాదములునమ్మవే । నిరతముసీలో ॥ గురు ॥ గురుదేశక్తితండ్రి గురుదేవైదైవంబని । గురినిల్పి ధ్యానించవె । గు రుమంత్రముమరువకజపియించవే।నిష్కామివై । పరమవైరాగ్యప్రబోధో పరతులనుబొందియు ప్రపంచము । మరచినిర్గుణచిత్సమాధిలో । మండల త్రయసాక్షమైన ॥ గురు ॥ ౧ ॥ పంచభూతాత్మికమైన యీశరీరభ్రాంతి నివిడనాడవె । మోక్షపదవి । గాంచియానందించవె। ఆగామియు । సం చితప్రారబ్ధమునువిద ।ళించిదహరాకాశమున సుఖియించికుండలిందృనిభే దించిసౌషుమ్నాంతరంబున ॥ గురు ॥౨ ॥ బిందు నిశ్చలంబు జేశిప్రణవబ్ర హ్మపీఠమునగూర్చుండవే ।పశ్చిమద్వారమందుజూచుచుండవే । సహస్రా రమందు। వేయికిరణములుగలిగియు । నిందుభాస్కరకోటిభాసుర ।సుం దరాకృతితోడవెలశిన । సుప్రసన్నస్వరూపుడైన ॥ గురు ॥ ౩ ॥ గంగా యమునసరస్వతులుగలసినట్టికమలముశోధించవే। బ్రహ్మవిష్ణుగంగాధరుల ముంచవేఅమృతరసము । పొంగినట్టిసముద్రమందునపూర్ణచంద్రునినను కరించివి । హంగమార్గమునందునారాయణస్వరూపముతోడవెలిగెటి ॥ గురు ॥౪॥ ఆదిబీజప్రసాదముస్వీకరించిబ్ర । హ్మానందమునజెందవే । అనా హత । నాదమువినుచుండవే । గ్రంథులమూటి । భేదనము జేశియుహీర ణ్మయబిందుమండలమధ్యమందున । నాదబిందుకళాత్మికంబగు । నాగతల్ప మునందుమెరశెటి ॥గురు॥౫॥యరుకమరపుల నెరిగేయరుక నేననితెలశి। యే కాంగివైయుండవే । శాశ్వితమైన । పరమసౌఖ్యమునొందవే ।శ్రీవేంకట।

గురుశిఖామణి యగుచుసతతమునిరతిశయవైభవముగలిగియు। చిరతరంబై నట్టికృపచే । చెంచురామకవీంద్రునేలిన ॥ గురు ॥ ౬ ॥

కాంబోదిరాగం - ఆదితాళం.

జ్ఞానయోగపురుషుడతడౌరా। సంశయములేదు ॥ జ్ఞాన॥ మానసేంద్రియములవృత్తులన్నియణచిశుద్ధచి । న్మాత్రుడైయ్యుకామరాగమోహహితుడై । మానినైసుషుమ్నానాడిమార్గమందుదృష్టినిల్పి । జ్ఞానవిజ్ఞానలోచనములుగలిగిచూచువాడు ॥ జ్ఞాన ॥ ౧ ॥ పరమహంసతారక ప్రసన్నయోగమవధరించి । గురుకటాక్షవీక్షణమునగూఢచిత్తుడై । ధరణిసలిలదహనవాయుగగనములణచిమూడు । పురములనుదహించిమించి । పూర్ణబోధగలుగువాడు ॥ జ్ఞాన ॥ ౨ ॥ ధీరుడై ప్రపంచవృత్తినెల్ల మరచి ఘోరసం । సారబంధకర్మములంటకుండనే । భూరి సహస్రారకమలమధ్యమందునున్నయమృత । సారమె దానిని వశత్వమునను న్నవాడు ॥ జ్ఞాన ॥ ౩ ॥ వాసనత్రయములద్రుంచిబిందునిశ్చలంబుజేసి । వాసుదేవ బ్రహ్మమందుమనసుజేర్చియూ । ఆశలన్నిగోసివేసిశాంతిశమదమాదిగుణవి । కాసుడైసమాధియోగనిష్టలన్నిగలుగువాడు ॥ జ్ఞాన ॥ ౪ ॥ పంచకోశములనువిడచినిష్ప్రపంచమానసమున। ప్రకృతిగుణవికారములనువోలగద్రోచి। శ్రీ । పంచవహ్ని వేంకటార్యు। పాదపద్మములుగొల్చి । చెంచురామదాసునెపుడు । పాలనంబుజేయువాడు ॥ ౫ ॥

దర్బారురాగం - ఆదితాళం.

జ్యోతినీజూడరా । నీలోపరంజ్యోతినిజూడరా । కూతలుబెట్టుచున్నకోరికలనుబట్టి । నీతులుదెల్పుచునింగికిలంఘించిపరం ॥జ్యోతి॥ ౧ ॥పదితురంగములయొక్క । పరుగులుబంధించి । సుదతినివిడచిసోమసూత్రములోపలపరం ॥జ్యోతి ॥ ౨ ॥ మూడునదులుగలశే । మోక్షసాగరమందు । మూడుపర్వతముల । మునిగిపోవంగనైన పరం ॥జ్యోతి॥ ౩॥ రెండునొక్కటిజేసి రేయుబగలులేని । పండువెన్నెలబయలునిండినకోనలో । పరం । జ్యోతి॥ ౪ ॥పదివిధములుగలపవనునిబంధించి। హృదయకమలమునందూ । దరకవెలుగుచున్న ॥ పరంజ్యోతి ॥ ౫ ॥ రెండుచక్రములుగలబండిమీదనునెక్కికుండలీస్థానముకుదురుగపైకినెత్తిపరం। జ్యోతి॥ ౬ ॥ ఆదిబీజమునందునవతరించినయమృత । వేదసారముగ్రోలివేయుదళముల నడుమ పరం ॥ జ్యోతి॥ ౭ ॥ కర్మనేత్రముభస్మీకరణమొందగజేసి । నిర్మలమూర్తి

వై । నిర్గుణసమాధిలో ॥పరంజ్యోతి॥ ౮ ॥మేరుశిఖరమునందు మెరశిన వేం
కట । నారశింహగురునాథుని సేవించి ॥పరంజ్యోతి॥ ౯ ॥ పంచకోశములవి
డచి । బ్రహ్మకోశమునందు । చెంచురామకవికి ।జీవనదీపమైన।పరంజ్యో
తినిచూడరా ॥ ౧౦ ॥

ఆరభిరాగం-ఆదితాళము.

రామాఘనకామా । దులతామసములశమియింపవయ్యావో ॥రా
మాఘనకామా ॥ భూమినఖిలవైశ్వానరముఖనిజ ।భూతములను గెల్చి।గు
రునిమెల్లదాల్చి । గురిదెల్చి । గుణతతిని గాల్చివో ॥రామా॥ భానుసో
మసంబంధంబుల రెంటినిబంధనంబుజేసి । విజ్ఞానసతిని గదిసి । మతిదీసి। పర
మందుప్రవేశివో ॥రామా॥ ౨ ॥ జన్మమరణముల జెందనిసిరుపము । చదువుజ
దవవయ్యా । యికజన్మమెందుకయ్యా । వినుమయ్యా పరికించవయ్యావో ॥
రామా॥ ౩ ॥గనుడగనుని శివధాతలకివ్వలిపరమ పదముగాంచి । ప్రణవర
వమునదిరాలించి । ధ్యానించి । లక్ష్యాసనముంచివో ॥రామా॥ ౪ ॥యి
రువదొక్కవేలారుశతంబుల । విమలజపమునిలిపి । ఫణిపతునిమరలెలిపి।
మదినిల్పి । కళమెందుసల్పివో ॥రామా॥ ౫ ॥మూడునదులునొకవిధమున
గలశిన । ముక్తిబిలముజేరి । పదియేడుగిరులమీరి । దవిమూరి । బయలం
దుజేరివో ॥ రామా॥ ౬ ॥ పంచవహ్ని వేంకటగురునాథునిపదమునమ్మవ
య్యా ।పరవాంచలెందుకయ్యా । పదవయ్యా । పూజించవయ్యావో ॥
రామా॥ ౭ ॥ చెంచురామకవిననెడియహంకృతిజెందనేలనయ్యా ।గురిమిం
చిచూడవయ్యా । యిదిమాయాసంసారమయ్యానో ॥రామా॥౮ ॥

ధన్యాశిరాగం - అటతాళం.

పరిపూర్ణ భావము పొందగలేని । యిరుకయేలరాజీవా । పుర
వైరిరమాపతివాణిసతీవరుల । స్ఫురము లొక్కటిజేశి ॥ పరి ॥ ౧ ॥ ఆకా
శాదిభూతాతీతంబై నిరాకారంబైన పదవిలో ॥ పరి ॥ ౨ ॥ బ్రహ్మాండవి
శంబున దూరుచుపర । బ్రహ్మైక్యసమాధిలో ॥ పరి ॥ ౩ ॥ నిరుపా
ధికమై । నిష్కారణమైచిర । తరమైయొప్పినదేశమున ॥ పరి ॥ ౪ ॥ పం
చాగ్నుల వేంకటదేశికునినుతియించి । పదములుపూజించి ॥ పరి ॥ ౫ ॥

ఆహిరిరాగం - ఆదితాళం.

యెరుకమరపులను యెరిగెడియుకను నేనూ। బ్రహ్మేంద్రజనార్ద
న । పురహరాదినిజరూపంబులుగానూ । కాలత్రయమందున । నిరు

సిమహావాక్యతర్కముపాదించరా ॥ సకల ॥ ౫ ॥ పంచవహ్నివేంకటగురుబ్రహ్మమైయున్నానురా । పంచతన్మాత్రలకుమహా । ప్రభువునైయున్నానురా । చెంచురామకవినిపరమశాంతునిజేశెదనురా ॥ సకల ॥ ౬ ॥

నాదరామక్రియరాగం - అటతాళం.

నారాయణగోవిందా । సర్వకారుణపురుషజగన్మూలకందా। నారాయణగోవిందా॥క్షీరసాగరమధ్యమందునసౌవర్ణ । సారసమొక్కటియున్నాదిరా । సారసనాళంబులోపల వేదాంతసారామృతమునిండియున్నాదిరా శ్రీ ॥ మన్నారాయణ ॥ ౧ ॥ పశ్చిమదేశమునదివ్యమైనమేరు । పర్వతమొక్కటియున్నాదిరా । నిశ్చయముగదానిశిఖరమందుననింద్ర । నీలవర్ణబిళమునున్నాదిరా శ్రీమ ॥న్నారాయణ॥ ౨ ॥ జననమరణములేని పంచవన్నెలపక్షి ।జగములనన్నిటిభ్రమింగునురా । యెనిమిదిరెక్కలుగలిగి యాకాశమున । కెగరుచుప్రకామికిలంఖించురా శ్రీమ ॥న్నారాయణ॥ ౩ ॥ ఆవగింజరంధ్రమందుమదించిన । దేవనాగజమొకటియున్నాదిరా। దేవేంద్రాదిమహాసిద్ధులకైనను ॥ దీనిబట్టగస్వాధీనము గాదురా శ్రీమ ॥న్నారాయణ ॥ ౪ ॥ మూడునాలుకలుగలిగినపాముము । మూలకోనయున్నాదిరా । మేమకట్లు గలిగియెల్లకాలంబును। యెడతెగనిబుసకొట్టుచుండును రా శ్రీమన్నారాయణ ॥ ౫ ॥ యిరువదినాలుగుమెట్లుగల్గినట్టి ।వీణాదండము యొక్కటున్నాదిరా । బిరుసైనపదితంత్రులనుగూడిఘనమైన।స్వరసాహిత్యముగల్గిపాడునురా శ్రీమ ॥ న్నారాయణ ॥ ౬ ॥ మూడువంకలుగలిగి । మూడురూపములతో । మోహనాంగియొకతెయున్నాదిరా । మూడుజగంబులుదానికడుపులోన । ముణుగుచుదేలుచునుండునురా శ్రీమ ।న్నారాయణ ॥ ౭ ॥ బీజముమూలములేకపెరిగినవృక్ష । రాజముయొక్కటియున్నాదిరా । యీజగంబులకెల్లనీడగలిగియాది । బీజసారముచేతనిలచెనురా శ్రీమ ॥ న్నారాయణ ॥ ౮ ॥ రాత్రియుబగలును లేనిదేశమున । రాక్షసియొక్కటియున్నాదిరా । నేత్రముదెరిచితెనిఖిలలోకంబులు ।నిముషమాత్రములోనభస్మమౌరా శ్రీమ ॥ న్నారాయణ ॥ ౯ ॥ గాలినిఅగ్నినిజలమునుపృథివిని । గలుగజేశినదొకటియున్నాదిరా । గాలికిగదలకఅగ్నికిగాలక । గమనాగమనములులేకుండురా శ్రీమ ॥ న్నారాయణ ॥ ౧౦ ॥వేయుకిరణములుగలిగిప్రకాశించె । వినువిధియొక్కటియున్నాదిరా । యేయడజూచినావిశ్వస్వరూపుడై । వేంకటార్యుండచటనున్నాడురా శ్రీమ ॥ న్నా

రాయణగోవిందా ॥ ౧౧ ॥ పాంచజన్యశంఖమును బూరించుచునొక్క బ్రహ్మణిరంజిల్లుచున్నాదిరా । చెంచు రామకవిమంత్రతంత్రంబుల । చేపసంతోషించుచున్నాదిరా శ్రీమ ॥ న్నారాయణ ॥ ౧౨ ॥

శ్రీ రాగం - ఆదితాళం.

యేమని దెలిపెదనికరామా । యిదిఅదియని యెరుగట కేమని దెలిపెదనికరామా ॥ భూమికిజలశుచిపవనములకును । వ్యోమమునకుతుదనున్నదిబ్రహ్మము ॥ యేమని ॥ నామరూపగుణధర్మములచ్చటలేవూ । సోమభాస్కరులదీప్తులుగావూ । యేమనోత్ములకు నేత్రవతములకును । యరుగతరముగాకున్నదిబ్రహ్మము ॥ యే ॥ ౧ ॥ నిగమశాస్త్రములచేతను దెలియగరాదూ ।నిఖిలభువనములసంగతిలేదూ । పగలురాత్రులునులేకనచలమై । జగములన్నికనుచున్నదిబ్రహ్మము ॥ యే ॥ ౨॥ హరిహరాదిరూపంబులునచ్చటలేవూ । యరుకమరపులనెవిక్రుతులుగావూ । నిరుపమానమై పరిపూర్ణంబై । నిర్విశేషమైయున్నదిబ్రహ్మము ॥ యె ॥ ౩ ॥ బంధమోక్షములుప్రక్రుతులునచ్చటలేవూ । ప్రణవబిందుకళలంటగరావూ ।యెందుజూచినానిష్కళంకమై । యేకరూపమైయున్నదిబ్రహ్మము ॥ యే ॥ ౪ ॥ కన్నదోయికినిమనసుకుగానగరాదూ । సన్నుతించసాకారములేదూ । యన్నివిలయములుజరిగినగాని । యెప్పటికినిగలిగున్నదిబ్రహ్మము ॥ యే ॥ ౫ ॥ జాగ్రదాద్యవస్థాత్రయములునటులేవూ । జన్మమరణస్వప్నంబులురావూ । వుగ్రమైనమంత్రోపాసకులకు । విగ్రహంబుకనిపించదుబ్రహ్మము॥ యేమని ॥ ౬ ॥ బ్రహ్మయజ్ఞపారీణులకునుదుల్లభమూ । ప్రక్రుతిరహితులకునెరుగసులభమూ । బ్రహ్మాండములకువెలుపలలోపల । పరమగోప్యమైయున్నదిబ్రహ్మము ॥యే॥ ౭ ॥ పంచకోశములభ్రాంతియునచ్చటలేమా। పంచగగనములకాంతియుగాదూ । పంచవహ్నివేంకటగురురూపంబవధరించిమెరశున్నదిబ్రహ్మము ॥ యేమని ॥ ౮ ॥

నాదరామక్రియ రాగం - అటతాళం.

యేలాగునధ్యానించెదవూ ।జీవా। యేరూపమనినీవుపూజజేశెదవూ । యేలాగు ॥ స్థూలసూక్ష్మకారణములుమనోమాయా।లీలలన్నియుమాయారూపములురా । స్థూలసూక్ష్మకారణములమెరిగిపరి ।శుద్ధమైనదిపరబ్రహ్మమురానీవు ॥ యేలాగు ॥ ౧ ॥ చంద్రసూర్యాగ్నులునక్షత్రములునుబ్ర । హ్మేంద్రాదులునుమాయారూపములురా । చంద్రసూర్యా

లకుసకలలోకములకు । సాక్షమైనదిపరబ్రహ్మము రానీవు ॥ యే ॥ ౨ ॥
ధరణియుజలమును వాయువుగగనము । హరిహరాదులు మాయారూపము
లురా । ధరణిజలాదిభూతంబులకు సదా । ధారమైనదిపరబ్రహ్మమురా
నీవు ॥ యే ॥ ౩॥ నాదబిందుకళలు । పంచతన్మాత్రలు । నానాకళలుమా
యారూపములురా । నాదబిందుకళలనాదుచుమాయకనాదియైనపర
బ్రహ్మమురానీవు ॥ యే ॥ ౪ ॥ సాత్వికరాజసతామసములుజాగ్రత్స్వ
ప్నసుషుప్తులుమాయారూపములురా । సాత్వికరాజసతామసాతీతమైనస్వరూ
పమైనదిబ్రహ్మమురానీవు ॥ యే ॥ ౫ ॥ యమనియమాదియోగాభ్యాసము
లువాని । వ్యాపారములు మాయారూపములురా । యమనియమాదియో
గంబులకందక । వెలుగుచున్నదిపరబ్రహ్మమురానీవు ॥ యే ॥ ౬ ॥ సకల
వేదంబులుసర్వశాస్త్రములుసత్కర్మలును మాయారూపములురా । సక
లవేదంబులకైననువర్ణింప । శక్యముగానిదిబ్రహ్మము రానీవు ॥ యే ॥ ౭ ॥
యజ్ఞదానవ్రతజపతపహోమహోమములు । యరుకమార్గములుమాయారూపము
లురా । యజ్ఞదానవ్రతజపతపములచేత । నెరుగరానిదిపరబ్రహ్మము రా
నీవు ॥ యే ॥ ౮ ॥ నామరూపవర్ణాశ్రమకులగోత్రముల్ । కామాదులును
మాయారూపములురా । నామరూపవర్ణాశ్రమములులేకన । సాహిత
మైనదిబ్రహ్మము రానీవు ॥ యే ॥ ౯ ॥ అవ్యక్తమును మహదహంకారములు
నుబాహ్యాంతరంబులు మాయారూపములురా । అవ్యక్తమును మహదహం
కారమునకట్టి యుంటకనున్నదిబ్రహ్మమురానీవు ॥ యే ॥ ౧౦ ॥ రాత్రియు
నుబగలును రాకుసగుణములు । నేత్రత్రయమును మాయారూపములురా । రా
త్రియుపగలును లేకనిత్యముజ్ఞాననేత్రమైనదిపరబ్రహ్మము రా నీవు ॥ యే ॥
౧౧ ॥ పంచకోశంబులుపంచాకాశంబులు । పంచబ్రహ్మలుమాయారూ
పములురా । పంచాగ్నులవేంకటార్య స్వరూపమైప్రజ్వరిల్లినదిబ్రహ్మము
రానీవు । యేలాగునధ్యానించెదరా ॥ ౧౨ ॥

సురటరాగం - ఆటతాళం.

అదియొపరబ్రహ్మమని యెరుగవయ్యా । అదియొపరమానందమని
నమ్మవయ్యా । మొదలునుతుదలేక మూడుకాలములందుకదలకవిమలమైక
నుపించునయ్యా । ముదుసులేనయు దెలశెమూడుజగములులేని । హృదయ
గగనమునందునూహించవయ్యా ॥ అది ॥ ౧ ॥ సృష్టిలేనప్పుడుసృష్టికాలము
నందు । సృష్టిపోయినవెనుకచూడవలెనయ్యా । స్పష్టముగాబయలుశోధిం

చివర్తించు । కష్టయోగము చేసి కార్యమేమయ్యా ॥ అప ॥ ౨ ॥ ఆకారను
లు గాక రాకపోకలు లేక । చీకటి వెలుతురు గాకున్నదయ్యా । యేకరూపం
బగుచు యేకాలముకున్నైన । శోకమోహంబుల జెందదయ్యా ॥ అప ॥ ౩ ॥
నిరుపమానందమైనర్విశేషంబయ్యు । నరుకమనుప్రలు లేక వెలుగుచునయ్యా
పరమపదమును లేని బ్రహ్మలోకము లేమి । ఫ్రిరమైత్రిలోకంబు పొందలేదయ్యా
అప ॥ ౪ ॥ నిరతిశయంబగుచు నిష్కళంకముతోడ । మరిజననములెప్పుడు
మరిపొందదయ్యా । స్ఫూర్తియుంచుటకు నెప్పుడు శరీరముగాకను । జగత్పూర్తి
మైయున్నది పాలించవయ్యా ॥ అప ॥ ౫ ॥ యే నియమములున్న యే మిసా
ధనులున్న । దానిమాయాంబుధిదరి తెలియదయ్యా । జ్ఞానమును అజ్ఞాన
మును లేదు స్మృతి లేదు । దానికే విభ్రాంతియూన లేదయ్యా ॥ అప ॥ ౬ ॥ పం
కోశంబులకు ప్రణవనాదంబునకుమించి వెలుగుచునుండు నెంచ లేవయ్యా
పంచాగ్ని వేంకటపరమార్యకృపగల్గి చంచలత్వము మానిశోధించవయ్యా ॥

తోడిరాగం - రూపకతాళం.

యారుకగలిగిబాధ జేసే యోగమేలరా । జీవా యోగమేలరా । యా
రుకసత్యమన్న బోధవ్యర్థమానురా ॥ ౧ ॥ బంధమోక్షములు రెండు ప్ర
కృతంబురా । అంధుడై విభ్రాంతినొందే యాశయేలరా ॥ యా ॥ ౨ ॥ కర్మ
నేత్రకళను సంపన్ను । జ్ఞానమేలరా । కర్మరహితమైన వెనుక । కలుషమేది
రా ॥ యా ॥ ౩ ॥ ముదురు తెత తెరిగిలేను మోహమేలరా । కదలకున్న బయ
లులోన । కన్ను వేయరా ॥ యా ॥ ౪ ॥ షోడశాక్షరములు గురుసులభమౌ
నురా । మూడుశరీరంబులకును మూలమేదిరా ॥ యా ॥ ౫ ॥ నేను లేని సమయ
మందు నీవు లేదురా । నేను నీవు గల్గియున్న నిజము లేదురా ॥ యా ॥ ౬ ॥ పం
చవంహ్ని వేంకటార్యపదమునమ్మరా । పెంచు రామకవిని అటంచు శరణుబొం
దరా ॥ యా ॥ ౭ ॥

యిందుస్తాని బంగ్ళాటిరాగం - ఆటతాళం.

పరిపూర్ణమైనట్టిబయలూ । యెరిగితే యెంతైయునిసికుమేలూ । ప
రిపూర్ణమైనట్టిబయలూ ॥ యారుకమరుపులు లేక । యారుగతరము గాక ।
నిరుపమానంబగుచు నిలచియున్నది జూడు ॥ పరి ॥ ౧ ॥ నీలపీతాదివర్ణము
లు గాకను జగ । జ్జాలమంతయు నిండి వెలుగుచున్నది చూడు ॥ పరి ॥ ౨ ॥ ఆకా
శాదిభూతములలోన వెలుపల । యేకస్వరూపమై వ్యాపించినది జూడు ॥ ప ॥
౩ ॥ మొదలు నడుమ లేక గోచరంబును గాక । కదలక పరిపూర్ణమైయున్నది

బూడు ॥పరి॥౪॥ హేతుదృష్టాంతము లేకమహాసూక్ష్మ । భూతమైయున్నది మేథాగలిగిజూడు॥ పరి ॥ ౫ ॥కలలోదోచినశరీరముఃరీతిదీనిలో । విలయమొందుచుబుట్టుచున్నజగముబూడు ॥ పరి ॥ ౬ ॥ ఆనందమునుగాక । రెండోరూపములేక । జ్ఞానజ్ఞానంబులు రెండుఁలేవుచూడు ॥ ప ॥ ౭ ॥పంచాగ్ని వేంకటపరమగురునిజేరి । పంచదశాక్షరిపఠనజేయుచుచూడు॥పరిపూర్ణమైనట్టిబయలు ॥ ప ॥ ౮ ॥ సూదిమొనమోపినమాత్రమైనగాని । లేదుపరసంధియుగోప్యమైనదిచూడు ॥ పరి ॥ ౯ ॥

సురటరాగం - అటతాళం.

నేనే బ్రహ్మమటంచునిక్కవలదయ్యా । నేనునీవనెమాటనిజముగాదయ్యా । నేనునీవనుశబ్దములురెండుబలికెటి । జ్ఞానమేదోదానివివరించవయ్యా । నేనునీవునువనినసమయంబుననుమరియు । నెవ్వాడుగంజిల్లునిదెలుపవయ్యా ॥ నేను ॥ ౧ ॥ సకలలోకంబులనుమెరిగిచూచెటివాని । నికరంబుగామాకుజూపించవయ్యాసకలవేదంబులనుచదివితెలిశినవారుప్రకటంబుగాబోధజేయవలెనయ్యా ॥నేను॥౨॥ఆదిమధ్యాంతశూన్యంబైనబయలులో।నఖిలలోకంబులనుమెవడుంచెనయ్యా। యీదివ్యమైనట్టిదృశ్యజాలంబంతనెచ్చోటననగునోనిదిజెప్పవయ్యా ॥ నేను ॥ ౩ ॥ నేనుమూఢాత్ముడనునీవుప్రజ్ఞానివి । నీకునాకునుతుదకునేదేశమయ్యా । నేను యేరూపమో । నివ్వేరూపమో । నిజముగానిదియుపదేశించవయ్యా॥ నేను॥౪॥ జీవేశ్వరులుయెవరోమెచటజంన్మించెనో । జీవేశ్వరైక్యంబుయేరూపమయ్యా । జీవుడనేపేరుయెవడుగల్పించెనోశివునినామంబేదోయిదిదెల్పవయ్యా ॥ నేను ॥౫ ॥ జాగ్రతయునుస్వప్నమునుసుషుప్తియునుమూటి । జెందివిడిచెటివానినిజూపవయ్యా । జాగ్రతయునుస్వప్నమునుసుషుప్తియునుమూడు । నిగ్రహించెటిసూత్రమిదిదెలుపవయ్యా॥నేను॥ ౬ ॥ పంచాగ్ని వేంకటబ్రహ్మణ్యుడనేనామ । మెంచ్చిపూజించెటిగురుతుయేదయ్యా । చెంచుగామకవీంద్రపారాయణంబైనపంచదశాక్షరీరూపమేదయ్యా॥ నేనే॥ ౭॥

పున్నాగరాగం - ఆదితాళం.

అనందమానందమాయెనూ । దురభిమానమంతయుదొలగిపోయెనూ । బ్రహ్మ । జ్ఞానమేసంసారమాయెనూ ।మహా। మౌనమేనిత్యజపమాయెనూ ।స్వాధి। ష్ఠానపిజ్జలధిమెందుస్నానముజేశితి ॥అనంద॥ ౧ ॥ సాధనసంపత్తిలభించెనూ । గురునాధుడునన్నుకిరుణించెనూ ప్రకృతిబాధలన్ని

యుచొలగించెనూ।మహా। మేధావిగానను భావించెనూ ।కామ। క్రోధాదిశత్రువులఖండించిసిలచితి ॥ఆనంద॥ ౨ ॥ యేడుకొండలపైననాటనూ। గ్రోలి।మూడునదులుగలయుచోటనూ ।దేలి।మూడుమూర్తులువెలిగేబాటనూ ।మారి। మూడురంగులుగలకోటలోజేరి। మూడుశరీరములమూలమునెరిగితి ॥ఆనంద॥ ౩ ॥ రెండుతేజంబులొక్కటాయనూ।యీబ్రంహ్మాడంబులన్నిశూన్యంబాయనూ ।నిండి। పండువెన్నెలబయలాయనూ।మూడు। మండలంబులుసమసిపోయెనూ ।వూర్ధ్వ। కుండలిశక్తినిసేకుదురుగనెత్తితిని ॥ఆనంద॥ ౪ ॥ అష్టదళములకమలనాళము ।మారి। అష్టగజములకోలాహలము । జ్ఞాన। దృష్టిచెసమయించెకాలము । దెలశి।ద్రష్టదర్శనదృశ్యజాలములయమై । స్పష్టముగానుపరబ్రహ్మమైమెరశితి ॥ ఆనంద॥ ౫ ॥ వాదభేదంబులణగిపోయనూ ।విమల। బోధోపరతులువిశదంబాయనూ ।ఖేద। మోదంబులునుసమములాయనూ । ప్రణవ। నాదమంతయురహితమాయనూ ।జగ। దాదిబీజామృతము । నమరిధన్యుండనైతి ।ఆనంద॥ ౬ ॥ ఆరోహణస్పర్శలుమేధలూ ।సోకి। ఘోరమైనట్రిజరావ్యాధులూ। దొలగి । సారతరమైనగగనాదులూ ।లంకె। లాయూఢిగానువదలెబోధలూగలిగిధారణాయోగమునే।ధరియించివెలశితి ॥ఆనంద॥ ౭ ॥ సోహంబనెడుహంసమంత్రము । మూడు। దేహంబులకుమూలమంత్రము। దుఃఖదాహంబుదీరేటిసూత్రము ।చిత్ర। వాహంబులోనయున్నచిత్రము । యెరిగి। దేహాభిమానంబుదీరినేనిలచితి ॥ఆనంద॥ ౮ ॥ నిరుపమనిర్గుణసమాధిలో ।నిలచి। పరమసౌషుమ్నపురవీధిలో ।గలశి। చరమార్థసారమైనబోధలో ।మునిగి। వరసాహస్రారకమలవేదిలో ।జూచి । మరలజన్మించెటి। మార్గమువిడచితి ॥ఆనంద॥ ౯ ॥ పంచాగ్నివేంకటదేశికుని । సన్నుతించిదక్షిణమర్పించితిని। యీప్రప । పంచనిష్టలుమానుకుంటిని । నిష్ప్రపంచభావముపొందుచుంటిని।యిప్రడు । చెంచురామకవినైశరణుబొందితినేను॥ఆనంద॥

## మంగళహారతులు.

### సౌరాష్ట్రరాగం - ఆదితాళం.

మూలాధారచక్రమందుభూమిని దాటించి । మూడుదేవనదులలోనస్నానముజేయించి । లీలామాత్రమైనజగములీనమయ్యేవిధిదెలపిన ।లోలాక్షియైనముక్తికాంతామణికి ॥ జయమంగళంనిత్యశుభమంగళం।జయాజయమంగళంనిత్యశుభమంగళం ॥ ౧ ॥ స్వాధిష్ఠానకమలమందుజలముదా

టించి । బోధోపరతులందుమనసుపొందగావించి । వేదములన్నిదొలగించివే దాంతమార్గముజూపిన । శ్రీదేవియైనముక్తికాంతామణికి ॥జయ॥ ౨ ॥ మ ణిపూరకచక్రమందు । ననలముదాటించి । అణిమాదిశిద్ధులమహిమసరణి బోధించి । గుణములమూడింటిగలపి । గురుసూత్రమునెరిగించిన ॥ మణి వీణాపాణియైనముక్తికాంతకూ ॥ జయ॥ ౩ ॥ అనాహతచక్రమందుపవ నునిదాటించి । అమృతనాడీమార్గములోబుద్ధినిపొందించి । అనిశముయో గీంద్రపదవి । అనుభవింనెగటిజూపిన ।ఘనవేణియైనముక్తికాంతామణికి॥ జయ॥ ౪ ॥ వరవిశుద్ధకమలమందుగగనముదాటించి । యరుకమరపులను యెరిగే । యరుక నెరగించి । ఖగగేంద్రునినురలేపి । గురుతునెరిగించిన ట్టి । పరదేవియైనముక్తికాంతామణికి ॥జయ॥ ౫ ॥ ఆజ్ఞాచక్రమందునం తఃకరణనుదాటించి । ఆనందమునుజెందెటిలక్ష్యముజూపించి । ప్రజ్ఞానం బ్రహ్మమనెడిగురుమహావాక్యంబుదెలిపిన ।యాజ్ఞేశియైనముక్తికాంతామణి కి॥ జయ॥౬॥ సహస్రారకమలమందుప్రకృతిదాటించి । సద్గురునివేంకటా ర్యరూపముజూపించి । విహితదయారసదృష్టినె । వీక్షించినమహామా యా । సహితమైనట్టిముక్తికాంతామణికి ॥ జయ॥ ౭ ॥ పంచకోశముల నెభ్రాంతినివిడిపించి । పంచదశాక్షరిభావమునెరిగించి । చెంచురామదా సునికిచరమామృతసారంబిచ్చిన । పంచముఖియైనముక్తికాంతామణికి ॥ జయమంగళంనిత్యశుభమంగళం ॥ ౮ ॥

సురటరాగం - అటతాళం.

భూమిగోళమునందు । నాల్గుముఖములతో ।భూరిసువర్ణవర్ణం బునుగలిగి । శ్రీమన్మహాయోగశిద్ధిగలిగివిల।శిల్లియున్నట్టిశ్రీయిచ్ఛాశక్తికిని॥ మంగళంమంగళం॥ ౧ ॥ సలిలపురంబుననారుముఖములతో । లలితసంర క్తవర్ణంబునుగలిగి ।విలశితంబుగజగమునిర్మాణమునుజేశి । విలశిల్లియు న్నట్టిక్రియాశక్తికిని ॥ మంగళం॥ ౨ ॥ పావకగోళకమందుపదిముఖములు। ప్రజ్వరిల్లుచుశ్యామవర్ణంబుగలిగి । భావములరంజిల్లిజగములనన్నిటి। పరి పాలించినట్టి । జ్ఞానశక్తికిని ॥మంగళం ॥౩॥ వాయుగోళకమందుపదిరెం డుముఖములు । వసరుగధరియించి । శ్వేతవర్ణంబై ।మాయాశక్తిగూ డిసకలలోకంబుల । మాయించిమించిన । ఆదిశక్తికిని ॥మంగళం॥ ౪ ॥ఆ కాశగోళకమందుషోడశవదనారవిందములతో । నీలవర్ణంబై । ఆకా రమునుగానరాకుండగోప్యమై । వ్యాపించియున్నట్టి । పరాశక్తికిని॥మం

గళంమంగళం॥ ౫ ॥ ఆస్మగోళకమందు రెండుముఖములతో । రత్నకాంతియుగలిగిసకలసాక్షియునై । రత్నపీఠమునందుకోట్యర్కతేజమై । రాజిల్లుచున్నట్టిమూలప్రకృతికి ॥మంగళం ॥౬॥ గురుగోళకమ్మునపంచాగ్నివేంకట। గురురూపమైపదినూర్లముఖములతో । చిరకాలమునునెంచురామకవికిపరమ । సౌఖ్యమిచ్చినట్టిపరమేశ్వరికిని ॥మంగళంమంగళం॥ ౭ ॥

ఆరభిరాగం - ఆదితాళం.

మంగళముగురుస్వామికి । వేంకటయోగికి ॥ మంగళముగురుస్వామికి । గంగాయమునాసరస్వతులు । గలసిప్రవహించుచున్న । మంగళప్రదేశమందుమానసంబుచూపనిల్పి । మంగళస్నానంబుచేయించి। శాంభవిముద్రసంగతినిగురుతెరిగించి । జంగమస్థావరయుతజగములకుసాక్షియైనర । ధాంగపాణిమైనపరమాత్మునికినిత్యజయ ॥ మంగళంముగురుస్వామికి ॥ ౧ ॥ మూడుదీక్షులనుదెలిపి । మూడుప్రసాదంబులిచ్చి । మూడులక్ష్యంబులనుజూపి । మూడువాసనలుబాపి । మూడుబంధంబులనుద్రెంచి । నడినాళమందు । యేడుకల్లఘటనలేపి । మూడుయోగాభ్యాసములు ముందుగానెబోధజేసి । మూడునొకటిజేసినట్టి । ముక్తికాంతానాథునికి॥ మంగళము॥ ౨ ॥ సోహమనేహంసమంత్ర । సూత్రముగురుతెరిగించి ।ఐహికాముష్మికభోగములందు । యాశదొలగించి । దేహధర్మములనెల్లా నమ్మకుమని । దేహకార్యములవల్లా । దాహముదీరదటంచుతారకబ్రహ్మానందప్ర । వాహములోనుంచినట్టి । వాసుదేవునికిజయ ॥ మంగళము॥ ౩॥ తత్వమసీమహావాక్య । తర్కముజదివించిమహా । తత్వమందుయీజగంబు । దాగియున్నవిధముదెలిసి । సత్వరజస్తమోగుణముల్ । ప్రకృతికేదగుక । త్రుత్వముదేహేంద్రియంబుల్ । సత్వమువేగములురెండు । సత్యముల్గాదనినిజప్ర । భుత్వముపొందించినట్టి । పూరుషోత్తమునికిజయ ॥ మంగళము॥ ౪ ॥ అండపిండబ్రహ్మాండంబు । లన్నివెల్గుచున్నబ్రహ్మ । దండికిపైనున్నయమృత । భాండముశోధించిచంద్ర। చండరశ్మిమండలంబులా। యొక్కటిజేసి । పండువెన్నెలలోనబయలా । నిండినజ్ఞానదృష్టినిల్పియమృతరసముగోరిలి । యుండుమనిదెల్పినట్టి । పుండరీకలోచనునికి ॥మంగళము॥ ౫ ॥ యిరువదినాలుగుకట్లవీణయుపదితంత్రులతో । నిరతముమ్రోగుచునున్నస్వరములమర్మములుదెలిపి । యిరువదియొకవేలయారూ । నూరులసంఖ్య । పరమహంసజపముతీరు । స్థిరముగనుపదేశమొసగిచిన్న

యత్వమొందజేశి । కరుణతో నేలినముక్తి । కాంతామనోహరునకు ।మం
గళము॥౯॥ కాంచనలోష్టములుసమము గాను మెంచినిష్కర్మివై। పంచకో
శాతీతభావమునుపొందజేశి । పంచవిషయజన్యజ్ఞానమూ । వదలంచినిత్య
పంచనిత్యసత్యజ్ఞానమూ । వాంచదీర గానుప్రసాదించిచెంచురామకవిని ।
వంచనజేయకకరుణించ్చినట్టిదేవునికి ॥ మంగళముగురుస్వామికి । వేంకట
యోగికిమంగళము ॥ ౧౦ ॥

ముఖారిరాగ - జంపెతాళం.

నాల్గుసోపానములునయము గాదాటించి నాల్గువేదములలోనడితె
తెలిపి । నాల్గుసాధనములను । నంస్కారము గాజెప్పి । వెల్గుజూపిన
వెంకటేశ్వరునికి ॥ జయమంగళంసదాశుభమంగళం ॥ జయా ॥ ౧ ॥
ఆరుకోండలబిలము । ననువుగాగూరించి । ఆరుగజములమదము । ల
ణచివైచి । ఆరులోకంబులకునవలమార్గముజూపి । గారవించినవేం
కటేశ్వరునికి ॥ జ ॥ ౨ ॥ మూడుయోగంబులకుమూలంబుబోధించి
మూడుకాలువలలోముంచి తేల్చి । మూడుపైశాచములమురిపెంబులణగిం
చు । జోడుగల్పినవేంకటేశ్వరునికి ॥జయ॥ ౩ ॥ యేదుబాధలుబాపి। మూ
డునాకటిగల్పి । యేడుశక్తువిలేపి । మూడునిలిపి । మూడువేషంబులను
ముఖ్యంబు గావేశి । యీడుజూపినవేంకటేశ్వరునికి ॥జయ॥ ౪ ॥ పంచకో
శంబులకుపైనలక్ష్యము నిల్పి । పంచగనములలోపట్టుజూపి ॥ చెంచురామక
వీంద్రుచిత్తంబురంజిల్ల । వాంచదీర్చినవేంకటేశ్వరునికి ॥ జయమంగళంని
త్యశుభమంగళం ॥ ౫॥

దేశియుంభైరవిరాగం . రూపకతాళం.

వేంకటేశ్వరునికిమంగళం । శ్రీరాజయోగికి ॥ వేంకటేశ్వరునికిమం
గళం ॥ లంకెవైదువదలజేశి । లక్ష్యలక్షణములజూపి । శంకరజీవైక్యపదవి
జెందగరక్షించినట్టి ॥వెం॥ ౧ ॥ ఆరుకోండలమీదనుండె । మెరుపర్వతబిళ
ములోన దూరిపరిశీలించుమని । దారిదప్పకనెరుగజెప్పిన ॥వెం॥ ౩ ॥తొం
బదియారుగుఱ్ఱములను । తోలెటిసారధినిజంపి । అంబరమునకేగుమనియ
రదముజూపించినట్టి ॥వేం॥ ౩ ॥ మండలములరెండుగలిపి । మానవలోక
మునుబాపి । కుండలిస్థానంబునందు । పండువెన్నెలజూపినట్టి । వెం॥౪॥
పంచకోశములబాఱింతి । పరమపదమునందుజేర్చి । చెంచురామకవివినివై
సంచరింప్పుమనుచుదెలిపిన ॥ వేంకటేశ్వరునికిమంగళం ॥ శ్రీరాజయోగికి ॥

### సురటరాగము - అటతాళము.

గురునాధునికి । యోగపతికి । జయమంగళంశుభమంగళం ।పరమేశ్వరుడగు ॥గురు॥ యిరువదినాల్గుగుఱ్ఱములగట్టినరధము । నెక్కి ప్రకాశింపుచూ । అండత్రయపురములు పాలింపుచూ । పరమాత్ముడై । యిరుకమరపులరెంటినెరుగుచు । యేకరూపనుతోడజగముల । సరణిజూచుచు ప్రకృతినంటక । సాక్షియైవ్యాపించిమెరశెటి ॥ గురునాధునికి ॥ ౧॥ ఆరుదీపములకుపైనవెలుగుచునున్న ఆదిపరంజ్యోతియై। ఘోరంబగుసంసారబంధవిఘాతియైనిరవేద్యుడై। నారదాదిమునీంద్రవరులకునైనదుర్లభమగుచునిరహం । కారుడైబహిరంతరములను । మీరివెలుగుచునున్నవేంకట ॥ గురు ॥ ౨ ॥ పంచకోశములనేభ్రాంతియేమియులేక । బ్రహ్మస్వరూపుండునై । అసమానుడై । పంచభూతాతీతుడై । నిరుపాధికుడై । పంచదశిమంత్రానుభవుడగుచెంచురామకవీంద్రునికికరు । ణించిహృదయముకేవలముశాం । తింపసుఖమునుపొందజేసిన ॥ గురునాధునికియోగపతికిజయమంగళంమంగళం ॥ ౩ ॥

### శంకరాభరణరాగం - ఆదితాళం.

లాలిఆత్మారామలక్ష్యార్ధకామా । లాలిచిన్మయసోమలక్ష్మిసుధామా ॥లాలి ॥ విమలసౌషుమ్నసౌధాంతరమునందు। వేయుదళములకమలమంటపమునందు । సమరసానందక్షీరాంబునిధియందూ । సకలసాక్షివియగుచుపవళించినావు ॥ లాలి ॥ ౧ ॥ యేడుప్రాకారములదేవాలయమునా । యేడుసోపానములపంజరములోనా । యేడుభూషణములతోరంజిల్లుచున్నా । యోగమాయనుగూడిపవళించినావు ॥ లాలి ॥ ౨ ॥ సంతతముబ్రహ్మాండబిళములోపలనూ।సచ్చిదానందవిగ్రహముమెరయగనూ। అంతరాంతరముక్తికాంతకుచమునను । అమృతపానముజేసిపవళించినావు ॥ లాలి ॥ ౩ ॥ అండపిండాండబ్రహ్మాండములలోనా । కుండలీశక్తిసద్గర్భగోళమునా । మండలత్రయవిలక్షణకోశమునా । పండువెన్నెలలోనపవళించినావు ॥ లాలి ॥౪ ॥ సకలజగములుసదునెంచుసమయమునా । సకలంబునీవయైదివ్యతేజమునా । సకలజగములుమేలుకొన్నసమయమునా । సకలాంతరాళమునపవళించినావు ॥లాలి॥ ౫ ॥ నాదబిందుకళాధిదేవతయునీవై । నాగతల్పమునందునేకాంతమతివై । ఆదినారాయణుడవైనిర్మలుడవై । అసమానమూర్తివైపవళించినావు ॥ లాలి ॥ ౬ ॥ రా

పనామక్రియలుగలుగుకన్యకనూ ।గూఢంబునూలుంచి దాని దానిచెనగుచునూ । చూపిచెప్పగరానిసౌఖ్యమొందుచునూ । చూపులో పలసిన్నపవళిం చినావు ॥ లాలి ॥ ౭ ॥ మూడునదులునుగలశియున్నతావునూ । ముప్పురుజలక్రీడలాడుతావునూ । మేరుజలధులనడుమనున్నపురమునూ । యోగనిద్రనుజెందిపవళించినావు ॥ లాలి ॥ ౮ ॥ జననపాలనవిలయలీల లింపొందా । జలజాక్షశివధాతకళలుపెంపొందా । అనిమిషత్వముతోడ కనులుచెన్నొందా । అంతరిక్షమునందుపవళించినావు॥లాలి॥ ౯ ॥పంచాగ్ని వేంకటబ్రహ్మరూపమునా । పరమతారకరాజయోగమార్గమునా చెంచు ... కవీంద్రహృత్పంకజమునా। చిద్ఘనుండవై పవళించినావు॥లాలి॥ ౧౦॥

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

రామలాలీ ఆత్మారామలాలీ భూమానందరూపపరంధామ లాలీ । కామక్రోధములవిడచి కనకగిరిశిఖరాగ్రమునందు । నీమముతో పవ్వళించి నిదుర జెందరా ॥ రామ ॥ ౧ ॥ క్షీరపారావారమందు చిన్మయస్వరూపుడవై । ధీరుడవై పవ్వళించి తేజరిల్లరా ॥ రామ ॥ ౨ ॥ గంగాయమునలనడుమ ఘనసౌషుమ్నపురములోన । నింగికెగయుచు పండి నిదురజెందరా॥ రామ ॥ ౩॥ మనసువాయువుల్లొక్క మార్గమందు నిల్పి నిత్యప్రణవానుసంధానముతో పవ్వళించరా ॥రామ॥ ౪ ॥ అమృతపానము జేయుచు నానందమునను జెంది । నిర్వికల్పస్వరూపుడవగుచు నిదురజెందరా ॥ రామ ॥౫॥ వేయురేకులకమలవేదికమధ్యమునందు । మాయకయోగమాయతో పవ్వళించరా॥ రామ॥ ౬ ॥ సర్గస్థితిలయములసరణి దెలసి సంతతంబు । నిర్గుణసమాధిలోన నిదురజెందరా ॥ రామ ॥ ౭॥ అండపిండబ్రహ్మాండంబులందు వెలుగుచున్న శుద్ధపండువెన్నెలబయలులోన పవ్వళించరా ॥ రామ॥ ౮ ॥ లింగాంగములను రెంటి । లీనంబు జేయుచునొక్క । భంగినిలక్ష్యంబు నిల్పి పవ్వళించరా॥ రామ॥ ౯ ॥ చల్లనిగురుపాదతీర్థసాగరమున మునిగినీలో । పల్లవపాణిని గూడి పవ్వళించరా ॥ రామ ॥ ౧౦ ॥ పంచభూతముల గెల్చి పరశివుని రూపంబు దాల్చి । పంచాగ్ని వేంకటార్యుడవై పవ్వళించరా ॥ రామ ॥ ౧౧ ॥ చెంచురామకవినామము చిరకాలము నిల్పెనీవు । పంచవటిమంత్రాక్షరములో పవ్వళించరా॥ రామలాలీ॥౧౨॥

